# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

Acc. No. 17242

# శ్రీ సనత్సుజాతీయము



వేదవ్యాస ప్రణీతమైన మహాభారతము
ఉద్యోగ పర్వములోని సనత్సుజాతీయమునకు
తెనుగు సేత

"శాంతి శ్రీ"
జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి

# శ్రీ సూక్తమ్

"కరుణశ్రీ"

ఆత్యంతం మధురాకారం
నృత్యంతం భక్తమానసే
శ్రుత్యంతం సత్యసాహిత్యం
నిత్యం తం సాయినం భజే॥

ఏతత్ సనత్సుజాతీయం
లోకానుగ్రహకాంక్షయా
కృష్ణద్వైపాయనేనోక్తం
భారతోద్యోగపర్వణి

ఆంధ్రీకృత మిదం సమ్యక్
వేంకటేశ్వరశాస్త్రిణా
"శాంతిశ్రీ" కవితాఖ్యేన
భారద్వాజేన ధీమతా

ఇదం మోక్షప్రదం భూయాత్
ముదం దేయాత్ సదా సతామ్
భగవాన్ సత్యసాయీశః
ప్రయచ్ఛతు జయం శ్రియమ్॥

# సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ

అనంతమైన పరబ్రహ్మతత్వాన్ని ప్రకటించే సనాతన భారతీయ వేదాంత జ్ఞానం సత్యమైనది, నిత్యమైనది. పరమోత్కృష్టమైన మానవ జీవితానికి పరమార్థాన్ని, లక్ష్యాన్ని ప్రబోధించే భారతీయ వేదాంతానికి సాటి మఱియొకటిలేదు.

వ్యాసమహర్షి వేద విభాగంచేసి వేద వ్యాసుడయ్యాడు. ఆయన పంచమ వేదమైన మహాభారతాన్ని, అష్టాదశ పురాణాల్ని, ఉపపురాణాల్ని వినిర్మించాడు. శ్రీమన్మహాభారతాన్ని హృదయపూర్వకంగా పలికాడు. ఇంతటి సాహిత్య సృష్టి చేసిన మహాత్ముడు నభూతో న భవిష్యతి. అందువల్లనే

అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహు రపరోహరిః
అఫాల లోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః

అని వ్యాసుడు సాక్షాత్తు భగవంతుడుగా కీర్తింపబడ్డాడు.

శ్రీమన్మహాభారతం విజ్ఞాన సర్వస్వంగా ప్రశస్తి పొందింది. ధర్మతత్వజ్ఞులు ధర్మశాస్త్రమని, అధ్యాత్మవిదులు వేదాంతమని, నీతి విచక్షణులు నీతి శాస్త్రమని, కవిశేఖరులు మహాకావ్యమని, లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని, ఐతిహాసికులు ఇతిహాసమని, పౌరాణికులు పురాణ సముచ్చయమని మహాభారతాన్ని వినుతించారు.

ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న కుత్రచిత్

ధర్మార్థ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలను సాధించటానికి లోకంలో ఎన్ని ఉపాయాలున్నాయో అవి అన్నీ ఇందులో కనిపిస్తాయి. ఇందులో లేనివి మరెక్కడా లేవు—అని మహాభారత ప్రశస్తి.

ఇటువంటి మహాభారతంలోని పదిహేను పర్వాలను తిక్కన సోమయాజి రచించి "కవిబ్రహ్మ"గా ప్రఖ్యాతి పొందాడు. భారతంలో ఉద్యోగపర్వంలోని

సనత్సుజాతీయం, భీష్మపర్వంలోని భగవద్గీత, అనుశాసనిక పర్వంలోని విష్ణు సహస్రనామ స్తోత్రం ముఖ్యమైన ఘట్టాలు. ఈ మూడు ఘట్టాలను తిక్కన సోమయాజి తెలుగులోనికి తీసికొనిరాలేదు. వీటిల్లోగల శబ్దశక్తి, ప్రాచుర్యం, ప్రభావం, సంస్కృతంలోనే భద్రంగా ఉంటుందని మహాకవి భావించి ఉండవచ్చు. లేదా ప్రధానమైన కథా కథనానికి యివి దోహదం కావని తలంచి యుండవచ్చు.

## సనక సనందనాదులు

సనక సనందన సనత్కుమార సనత్సుజాతులు బ్రహ్మమానస పుత్రులు. వీరు బ్రహ్మజ్ఞాన సంపన్నులు, మహా మహిమోపేతులు. వీరు నిరంతరం కౌమార వయస్సులోనే ఉండి జ్ఞానవీధులలో విహరిస్తూ ఉంటారు. విష్ణు సేవాతత్పరులై సదా విష్ణు స్మరణం, దర్శనంలోనే కాలం గడుపుతుంటారు.

ఒకసారి సనక సనందనాదులు విష్ణుదర్శనార్థమై వైకుంఠం వెళ్ళారు. అక్కడ మహావిష్ణువు మందిరంలో ద్వార పాలకులుగా ఉన్న జయ విజయులు వీరి మహాత్మ్యాన్ని గుర్తింపలేక మూఢులై వీరి ప్రవేశాన్ని నిరాకరించారు. జయ విజయులు విష్ణుభక్తులే అయినప్పటికీ మాయలోపడి, గర్వం తలకెక్కి, మాన్యులను సామాన్యులని భావించి ద్వారం దగ్గర అడ్డగించి పరిహసించారు. సనక సనందనాదుల మనస్సు చివుక్కు మన్నది. ఆ మహాత్ములు జయ విజయుల గర్వాన్ని అణచటంకోసం "మీరు పతితులై రాక్షసులై జన్మించండని" శపించారు.

అప్పటికిగాని వారికి వీరి ప్రభావం తెలిసిరాలేదు. భయంతో, వినయంతో, పశ్చాత్తాపంతో జయ విజయులు మునీశ్వరుల పాదాలపై పడ్డారు. సంయమీంద్రుల మాట కటువు మనస్సు నవనీతం గదా! వారి దుఃఖం చూడలేక శాపానికి కొంత ఉపశమనం కల్పించాలని వీరు ఇలా ప్రశ్నించారు—"మీరు విష్ణు విరోధులై మూడు జన్మలలోనే విముక్తి పొందుతారా? లేక ఉత్తములుగా అనేక జన్మలెత్తి చివరకు విష్ణు సాయుజ్యం పొందుతారా?" అందుకు వారు — మూడు జన్మలలోనే విముక్తి ననుగ్రహించమని, వేగంగా విష్ణుసేవ ప్రసాదించమని కోరుకొన్నారు. దయామయులు అంగీకరించారు.

ఆ జయ విజయులే మొదట హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగాను, రెండవ జన్మలో రావణ కుంభకర్ణులుగాను, మూడవ జన్మలో శిశుపాల దంతవక్త్రులుగాను

జన్మించి జగత్కంటకుల్లై, విష్ణు విరోధుల్లై జనార్దనుని చేతిలో నిహతుల్లై విష్ణు లోకం పొంది విష్ణు సేవకులయ్యారు. సనక సనందనాదుల మహిమ అనిర్వచనీయం.

ఒకసారి బ్రహ్మదేవుడు నిరంతరం మోక్షలక్ష్మి పథంలో సంచరించే వీరిని పిలిచి జగత్కల్యాణం కోసం సృష్టి చెయ్యమన్నాడు. అప్పుడు సనక సనందనాదులు చతుర్ముఖునితో "పితృదేవా! బ్రహ్మమానస పుత్రులమై, మాన్యులమై, మీ కృపవల్ల జ్ఞాన సాగరంలో ఓలలాడుతున్న మమ్మల్ని సంసార సాగరం వైపు మళ్ళించటం భావ్యమేనా? నిత్యం శ్రీ మహావిష్ణువును సేవించే మాకు సంసార మాయా బంధాలు తగిలించటం సమంజసమేనా? దయచేసి మమ్మల్ని మోహంలో పడవేయవద్దు, జ్ఞాన వీథులలోనే విహరించనీయవలసింద"ని వేడుకొన్నారు. జ్ఞానమూర్తులైన వీరి వివేకానికి బ్రహ్మదేవుడు సంతోషించి వీరిని ఆశీర్వదించాడు.

* *

నారదమహర్షి తన భక్తిసూత్రాలలో "స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారాః" భక్తి స్వయంగా ఫలరూపిణి అని సనక సనందనాదుల ప్రబోధాన్ని ఉదాహరించాడు. భక్తులు భక్తిని పొందటానికై భక్తిని ఉపాసిస్తారు. భక్తికి భక్తియే ఫలం. అందుకే భక్తి సాధన సాధ్యంకూడ—అని బ్రహ్మ కుమారుల భావన.

నారద మహర్షి మరొక భక్తి సూత్రంలో "ఇత్యేవం వదంతి జన జల్ప నిర్భయా ఏకమతా కుమార వ్యాస శుక శాండిల్య గర్గ...." అని సనక సనందనాది బ్రహ్మ కుమారుల్ని భక్తి తత్వాచార్యులలో ప్రథమ గణ్యులుగా ఉదాహరించారు. నారద మహర్షికి కూడ వీరు పూజనీయులు. అందువల్లనే నారదుడు వీరికి ప్రథమ తాంబూలం యిచ్చారు.

ఈ మహనీయుల పేర "సనత్కుమార సంహిత" కూడ ఉంది. అందులో శ్రీ చక్ర విద్యను గురించి అనేక విషయాలు వివరింపబడ్డాయి. బ్రహ్మవాదులకు అంతరపూజ, తంత్రవాదులకు బాహ్యపూజ అందులో నిర్దేశింపబడి ఉంది.

వీరిలో సనత్సుజాతుడు మహా తపస్సంపన్నుడు. వేదాంత పరమార్థ విదుడు, పరమజ్ఞాని. ఈ సనత్సుజాతుడు ధృతరాష్ట్ర మహారాజుకు ప్రబోధించిన వేదాంతమే "సనత్సుజాతీయం"గా ప్రఖ్యాతి పొందింది.

# కథా సందర్భము

ధృతరాష్ట్రుడు హస్తినాపురానికి మహారాజుగా ఉన్నాడు. అతడు బాహ్యంగానే కాక అంతరంగా కూడ అంధుడు, ఆత్మజ్ఞాన శూన్యుడు. అహంకార మమకారాల వలలలో తగులుకొని బయటపడలేకపోయిన బలహీనుడు. మంచిచెడ్డలు తెలిసికూడ మంచిని ఆచరణలో పెట్టలేకపోయిన దుర్బలుడు.

నిరంతరం విదుర మహామంత్రి సాన్నిహిత్యంలో ధృతరాష్ట్రుడు ఎన్నో మహా మహిమోపేతమైన సూక్తుల్ని వినేవాడు, పరమానందాన్ని పొందేవాడు. కాని చివరకు తనదగ్గరకు, తన కుమారుల దగ్గరకు వచ్చేటప్పటికి వాత్సల్యం బలవత్తరమై అసత్తునుంచి సత్తువైపునకు మరలలేకపోయాడు. తన సోదరుని కుమారులైన పాండవులకు అంతులేని అపకారం జరుగుతున్నా కూడా అంధత్వమనే మిషతో నిర్లిప్తతను పూనిన కుటిలుడు ధృతరాష్ట్రుడు.

అంధుని కుమారుడైన దుర్యోధనుడు కూడ వివేకాంధుడై పాండవులకు తీరని ద్రోహం చేశాడు. అతని అకృత్యాలకు అంతం లేకపోయింది. చివరకు మాయోపాయాలతో పాండవులను అరణ్యాలకు పంపివేశాడు. అంతా విని ఏమీ ఎఱుగనట్లు మొసలికన్నీరు కారుస్తూ మిన్నకున్నాడు ధృతరాష్ట్రుడు. స్వార్థం, మమకారం, అహంకారం, అధికార దాహం మనిషిని అంధుణ్ణి చేస్తాయనటానికి ధృతరాష్ట్రుడే గొప్ప ఉదాహరణం.

పరమ శాంతమూర్తులైన పాండవులు మాయా జూద నియమానుసారం అరణ్యవాసం, అజ్ఞాతవాసం పూర్తిచేసికొని వచ్చారు అచ్యుతుణ్ణి ఆరాధిస్తూ కర్తవ్యం ఆలోచించారు. ఉపప్లావ్యం నుంచి ద్రుపద పురోహితుణ్ణి కరిపురానికి రాయబారం పంపారు. దీనికి ప్రతిగా ధృతరాష్ట్రుడు పాండవుల దగ్గరకు "వచోనిధి"యైన సంజయుణ్ణి పంపాడు. సంజయుడు తిరిగివచ్చి ధర్మజాదుల అభిప్రాయాన్ని తన హితవుతోపాటు ధృతరాష్ట్రుడికి విన్నవించాడు. ధృతరాష్ట్రుడికి ఏమిచేయాలో పాలుపోలేదు. మనసులో ఆందోళన ఎక్కువయింది నిద్రపట్టలేదు. వెంటనే విదురుణ్ణి పిలిపించాడు.

వివేక చూడామణియైన విదురుడు చేసిన హితోపదేశం విని ధృతరాష్ట్రుడు ఆత్మవిమర్శ చేసికొనసాగాడు. మరల మమకారం ముంచుకొచ్చింది. దానికి వశుడయ్యాడు ధృతరాష్ట్రుడు. "ధర్మమే జయించుగాక" అనుకొన్నాడేగాని మమకారాన్ని

వీడవటానికి సిద్ధపడలేదు. "ధర్మపథము, నీతి తత్వము చెప్పావుగదా ఇక నాకు పరమార్థ దృష్టిని తెలియచెప్పు" అన్నాడు ధృతరాష్ట్రుడు.

అప్పుడు విదురుడు ధృతరాష్ట్రుడితో "నాకుతోచిన ధర్మాలన్నీ చెప్పాను. అత్యంత రహస్యమైన మోక్షవిద్య చెప్పాలంటే మహాత్ముడైన సనత్సుజాతుడే సమర్థుడు. దేవతలకు కూడ తెలియని వేదాంత విషయాలు ఆయనకు తెలుసు" నన్నాడు. ధృతరాష్ట్రుడతి కుతూహలంతో "మనం ఇప్పుడు ఏవిధంగా ఆ మహాత్ముణ్ణి దర్శించాలి?" అని అడిగాడు—అప్పుడు విదురుడు అధిక భక్తితో ఆశ్రితవత్సలుడైన దివ్యజ్ఞానమూర్తియైన సనత్సుజాతుణ్ణి స్మరించాడు. ఆ మహానుభావుడు దయతో అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

భగవంతుడైన సనత్సుజాత మహర్షిని విదురుడు భక్తితో ఆతిథ్యమిచ్చి గౌరవించాడు. "దేవా! దేనివల్ల మానవులు సుఖదుఃఖాలు, లాభాలాభాలు, ప్రియద్వేషాలు మొదలైన ద్వంద్వాలలో పడకుండగా బ్రతుకగలరో అటువంటి పరమార్థాన్ని ఈ మహారాజు మీవల్ల వినాలని కుతూహల పడుతున్నాడని" విదురుడు మహర్షికి విన్నవించాడు. మహారాజు సనత్సుజాత మహర్షిని పూజించి గౌరవించాడు. వారి సంభాషణ ఆరంభమయింది....

# పుష్పాంజలి

భరద్వాజ స్ఫురద్గోత్రం రత్న రత్నాకరాన్వయమ్
ఆపస్తంబ మహాసూత్రం సాయిం వందే మహేశ్వరమ်။

సర్వధర్మ పరిజ్ఞేయం విశ్వవిద్యాలయాశ్రయమ్
కృపానిధిం జగచ్ఛ్రేయం సాయిం వందే మహేశ్వరమ్။

సౌందర్యలహరీం దేవీం మందహాస మనోహరీమ్
ఆనందకోశసంచారీం సాయిం వందే మహేశ్వరీమ్။

మానవ శరీరమే పుట్టపర్తి. లోపలి హృదయం ప్రశాంతి నిలయం. అందులోని ఆత్మస్వరూపుడే సత్యసాయి భగవంతుడు. ఈ స్వామి ఆశ్రితవత్సలుడు, ఆపద్బాంధవుడు, అనుగ్రహ సంపన్నుడు. అపారమైన కృపతో చక్కని ఆరోగ్యాన్ని, చల్లని పీఠము నాకు ప్రసాదించిన స్వామికి హృదయపూర్వక ప్రణామాలు။

సంస్కృత మహాభారతంలోని ఉద్యోగపర్వంలో గల సనత్సుజాతీయానికి ఇది తెలుగుసేత. ఆ మహర్షి ప్రవచించిన వేదాంత విషయాలు తెలుగులోనికి తేవాలని నా ఈ ప్రయత్నం။

"శ్రీ సూక్తం"తో ఆశీస్సుల ననుగ్రహించిన కవిశేఖరులు మా "కరుణశ్రీ" బాబాయిగారికి నా అభివందనాలు။

తిరుపతి తిరుమల వాసులైన పద్మావతీ వేంకటేశ్వరుల కృపవల్ల ఈ కృతి ఈ ఆకృతి ధరించింది. దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ సి హెచ్. వేంకటపతి రాజుగారికి, సప్తగిరి సంపాదకులు శ్రీ కె. సుబ్బారావుగారికి నా ధన్యవాదాలు.

ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించిన శ్రీ సాయి శ్రీనివాస ప్రింటర్స్ అధినేతలు శ్రీ సాయి గారికి కృతజ్ఞతలు။

సమస్త కార్యకలాపాలకు సూత్రధారియైన సత్యసాయి భగవంతునికి ఈ కృతిని భక్తితో, ప్రేమతో సమర్పిస్తున్నాను.

# సనత్సుజాతీయము

294.592
V4A

## "మృత్యువు లేదు"

10-00

వైశంపాయన ఉవాచ ACC NO. 17242

1. తతో రాజా ధృతరాష్ట్రో మనీషీ
సంపూజ్య వాక్యం విదురేరితం తత్
సనత్సుజాతం రహితే మహాత్మా
పప్రచ్ఛ బుద్ధిం పరమాం బుభూషన్

పురాణశాస్త్ర విశారదుడైన వైశంపాయనుడు జనమేజయ మహారాజునకు ఇలా విన్నవిస్తున్నాడు—

"ఓ జనమేజయ మహారాజా! మహా మనీషియైన ధృతరాష్ట్ర మహారాజు విద్వాంసుడైన విదురుడు చెప్పినవన్నీ ఆలకించాడు. ఆ తరువాత ఉత్కృష్టమైన జ్ఞాన ప్రాప్తి కోసం ధృతరాష్ట్రుడు ఏకాంతంలో మహాత్ముడైన సనత్సుజాత మహర్షి సన్నిధిలో కూర్చొని, ఆయనను ప్రసన్నం చేసికొని ఆ మహర్షిని ఇలా ప్రశ్నించాడు"—

ధృతరాష్ట్ర ఉవాచ—

2. సనత్సుజాతః యదిదం శ్రుణోమి
నమృత్యుర స్తీతి తవోపదేశమ్
దేవాసురాహ్యాచరన్ బ్రహ్మచర్య
మమృత్యవే తత్కతరన్ను సత్యమ్

ధృతరాష్ట్ర మహారాజు ఇలా ప్రశ్నించాడు—

ఓ సనత్సుజాత మునీంద్రా! మృత్యువనేదేలేదని తమరు అభిప్రాయపడినట్లు నేను విన్నాను. మరి దేవతలు, దానవులు మృత్యువునుంచి రక్షింపబడటానికి బ్రహ్మచర్యం పాటించారని విన్నాను. మృత్యువే లేనప్పుడు దానిని పోగొట్టుకొనటానికి ప్రయత్నించటమేమిటి? ఈ రెండింటిలో ఏది యదార్థమో వివరించవలసింది—

"ఏకశతం హవై వర్షాణి మఘవా ప్రజాపతౌ
బ్రహ్మచర్య మువాస తౌహ
ద్వాత్రింశతం వర్షాణి బ్రహ్మచర్య మూషతుః"

— ఛాందోగ్యోపనిషత్తు

ఇంద్రుడు ప్రజాపతి కూడ నూరు సంవత్సరాలు బ్రహ్మచర్యం పాటించారు. ఇంతేకాదు వారు అఖిల కల్పాంతరాలలో నివసించి ఇంకా ముప్పది రెండు వందల సంవత్సరాలు బ్రహ్మయందే చరించారు. బ్రహ్మయందు చరించటమే బ్రహ్మచర్యం. అదే ఆత్మాను సంధానం.

సనత్సుజాత ఉవాచ—

3. అమృత్యుః కర్మణా కేచిత్
మృత్యు ర్నా స్తీతి చాపరే
శ్రుణు మే బ్రువతో రాజన్!
యథైత న్మా విశంకిథాః

శ్రీ సనత్సుజాత మహర్షి ఇలా సమాధానం చెప్పసాగాడు— ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఈ విషయంలో రెండు పక్షాలున్నాయి. మృత్యువనేది ఉన్నది. అయితే బ్రహ్మచర్య వ్రతం దీక్షగా పాలించినపుడు ఆ సత్కర్మ వల్ల మృత్యువు దూరమవు

తుంది అని ఒక పక్షం. ఇంకొక పక్షం మృత్యువనేదే లేదు అని— ఆ విధానం ఏమిటో నీ సంశయం తొలగిపోయేలాగ వివరిస్తాను. ప్రశాంత చిత్తంతో జాగ్రత్తగా విను—

4. ఉభే సత్యే క్షత్రియాద్య ప్రవృత్తే
మోహాశో మృత్యు స్సమ్మతోయం కవీనామ్
ప్రమాదం వై మృత్యు మహం బ్రవీమి
తథా ప్రమాద మమృతత్వం బ్రవీమి

ఓ క్షత్రియుడా! సనాతన కాలం నుంచి వస్తున్న ఈ రెండు విధానాలు సత్యమే. కొందరు విద్వాంసులు మోహరూపమైన మృత్యువు యొక్క అస్తిత్వాన్ని సమ్మతించారు. నేను చెప్పేది ఏమిటంటే "ప్రమాదమే మృత్యువు, అప్రమాదమే అమృతము" అని.

"ప్రమాదః ప్రచ్యుతిః స్వాభావిక బ్రహ్మభావాత్"

—అని శంకరాచార్యులు వ్యాఖ్యానించారు. ప్రమాదం అంటే స్వాభావిక బ్రహ్మభావం నుండి జారిపోవటమే.

ఆత్మ తత్త్వం చూడకపోవటం ప్రమాదం. ప్రమాదమూలం అజ్ఞానం. అదే మృత్యువు. మృత్యువు అంటే అజ్ఞాన తమస్సు. పరాకు లేకుండా అవహితుడై ఉండటమే సమ్యగవేక్షణం. ఇది జ్ఞానం— అని శ్రుతి ప్రమాణం.

"తథాచ శ్రుతిః స్వరూపావస్థానమేవ మోక్షపదం దర్శయతి"
"పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపేణాభి నిష్పద్యతే"

స్వస్వరూపంలో ఉండటం మోక్షం. జీవుడు శ్రేష్ఠమైన జ్యోతియందు ప్రవేశించి స్వస్వరూపంలో ప్రవేశిస్తున్నాడు —అని శ్రుతి.

"ప్రమాద్యతేఽనేనేతి ప్రమాదోఽహంకారః
స్వాత్మని కర్తృత్వం మిధ్యా జ్ఞాన మిత్యర్థః"

ప్రమాదం అంటే అహంకార జనిత మోహం. పొరపాటు పడటమే ప్రమాదం. ఆత్మపైన కర్తృత్వం కలదు అని తలంచటం మిధ్యాజ్ఞానం. అది కూడ ప్రమాదంలో ఒక భాగమే.

5. ప్రమాదా ద్వై అసురాః పరాభవ
న్నప్రమాదాత్ బ్రహ్మభూతా స్సురాశ్చ
న వై మృత్యు ర్వ్యాఘ్ర ఇవా త్తి జంతూన్
నహ్యస్య రూప ముపలభ్యతే హి

ఓ రాజా! ప్రమాద కారణంగా అంటే దేహాదులే ఆత్మయని భావింపటంవల్ల ఆసుర సంపత్తి గలవారు మృత్యువువాత పడిపోతున్నారు. అప్రమాదం వల్ల కొందరు బ్రహ్మ స్వరూపులై రాణిస్తున్నారు. చిరంజీవులౌతున్నారు. మృత్యువు అంటే వ్యాఘ్రంలాగ నోరు తెరచుకొనిరాదు. అది చూడటానికి కనిపించదు. ఇది నిశ్చయం. మృత్యువునకు ఒక ఆకారం రూపం లేదు. అందువల్లనే నేను మృత్యువనేది ప్రమాదమేగాని వేరొకటి కాదని అన్నాను.

"అనుపలభ్యాత్మానం.... దేవా వా అసురా వాతే
పరాభవిష్యంతి. తం వా ఏతం దేవా
ఆత్మానముపాసతే"
"తస్మాత్తేషాంచ సర్వే లోకా ఆప్తాః సర్వేచ కామాః"

— శంకరాచార్య

ఆత్మను పొందలేక దేవతలు అసురులు పరాభవింపబడుతున్నారు. దేవతలు శ్రేష్ఠులు ఆత్మను పొంది సర్వ లోకాలను సర్వ కామ్యాలను అందుకోగలిగి కృతార్థులౌతున్నారు.

"అనుషు ప్రాణేషు ఇంద్రియేష్వేవ రమంతి ఇత్యసురాః"
"అనాత్మ విదః వైషయికాః"

అసురులంటే అసువులయందు రమించేవారు. ఆత్మను తెలియనివారు. విషయైక పరాయణులు. ఆత్మజ్ఞానం కలవారు ఆదిత్యులు.

6. యమం త్వేకే మృత్యుమతోఽన్య మాహు
రాత్మావాస మమృతం బ్రహ్మచర్యమ్
పితృలోకే రాజ్య మనుశా స్తి దేవః
శివః శివానా మశివో ఽశివానామ్

రాజా! కొంతమంది జనులు ప్రమాదం నుండి వేరైన యముణ్ణి మృత్యువు అని అంటారు. యముడు పితృలోకాలను పాలిస్తుంటాడని, ఆయన పుణ్యాత్ములకు మంగళమయ స్వరూపుడని, పాపాత్ములకు అమంగళ రూపుడని అంటారు. కాని నిజం విచారిస్తే అందరి హృదయాలలో ఉండే పరమాత్మే యముడు. ఆయన అమృతుడు, బ్రహ్మభావంలో చరించేవాడు.

"తమేవ విదిత్వాతి మృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ"
—శంకరాచార్య

పుణ్యాత్ములు దానిని తెలిసికొని అతి మృత్యువును, అమరత్వాన్ని పొందుతున్నారు. ముక్తిని పొందటానికి మరొక మార్గం లేదు.

"జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయాత్ పాపస్య కర్మణః"

పాపక్షయం వల్ల జ్ఞానం ఉత్పన్నమవుతుంది.

7. ఆస్యాదేశాన్నిస్సరతే నరాణాం
క్రోధః ప్రమాదో లోభరూపశ్చ మృత్యుః
అహం గతేనైవ చరన్ విమార్గాన్
న చాత్మనో యోగముపైతి కశ్చిత్

నేను ప్రమాదమే మృత్యువని అన్నానుగదా— ఏ విధంగానంటే అది మొదట అహంకారంగా పరిణమిస్తోంది. దాని నుంచి కామం, దాని నుంచి క్రోధం జనిస్తున్నాయి. చివరకు ఈ అహంకార రూపమైన అజ్ఞానం వల్ల రాగద్వేషాలకు లోబడి మానవుడు చెడుత్రోవల పడిపోయి క్రమంగా పరమాత్మకు దూరమౌతున్నాడు. ప్రమాదమే మృత్యువుగా పరిణమించటం అంటే అదే.

"కామ ఏష క్రోధ ఏషః కామాత్ క్రోధోఽభిజాయతే" —భగవద్గీత

ఇది కామం ఇది క్రోధం. కామం వల్ల క్రోధం జనిస్తుంది.

8. తే మోహితా స్తద్వశే వర్తమానా
ఇతః ప్రేతా స్తత్ర పునః పతంతి
తత స్తాం దేవా అనువిప్లవంతే
హ్యతో మృత్యు ర్మరణాఖ్యాముపైతి

అహంకారాది రూపమైన ఈ అజ్ఞానం చేత మృత్యువునకధీనులైన వారు ఈ లోకం నుంచి స్వర్గ నరకాదులకు వెళుతున్నారు. అక్కడ భోగానుభవ మున్న న్నాళ్ళు ఉండి అనంతరం మరల ఈ లోకంలో పడి జన్మనెత్తుతున్నారు. వెంటనే ఆ దేహి ననుసరించి ఇంద్రియాలు చేరుతున్నాయి. ఈ విధంగా జనన మరణ చక్రంలో చిక్కుకొని అజ్ఞానులు ముక్తికి దూరమౌతున్నారు. ఈ కారణం వల్లనే మృత్యువు మరణమనే పేరును పొందుతోంది.

9. కర్మోదయే కర్మ ఫలానురాగా
స్తే తత్రాను యాంతి న తరంతి మృత్యుం
సదర్థయోగా నవగమాత్స మంతా
త్ప్రవర్తతే భోగయోగేన దేహీ

ఓ రాజా! ఫలాలనుకోరి కర్మలను నాచరించేవారు ఆ కర్మ ఫలాలననుభవించటం కోసం జనన మరణ చక్రంలో తిరుగుతుంటారే కాని మృత్యువును దాటలేరు. దానికి కారణం అద్భుతమైన, ఆనందప్రదమైన పరమాత్మ తోడి సంబంధం వారికి తెలియక పోవటమే. ఆ యోగం తెలియక పోవటం వల్ల, భోగ సంబంధం యేర్పడటం వల్ల వారు నిరంతరం సంసారంలోనే పరిభ్రమిస్తున్నారు.

తస్మిన్ న్యావత్ సంపాత ముషిత్వాథె
తమేవా ధ్వానం పునః నివర్తంతే

—శంకరాచార్య

దానిలో జీవ భావం కర్మఫలానుభవం పూర్తి అయ్యేవరకు అందుండి మరల అదే త్రోవలో పోతారు. జీవ భావం అంటే మృత్యుముఖం; అదే మర్త్యభావం.

10. తద్వై మహామోహన మింద్రియాణాం
మిథ్యార్థ యోగేఽస్య గతిర్హి నిత్యా
మిథ్యార్థయోగాభిహతాంతరాత్మా
స్మరన్నుపాస్తే విషయాన్ సమంతాత్

మిథ్యార్థ యోగమంటే దేహమే ఆత్మ అనే అజ్ఞానం. ఇంద్రియాలు మహా మోహంతో అంటే విషయ సుఖాలలో చిక్కుకొన్న కొద్దీ ఈ అజ్ఞానం అధిక

పోతుంది. అందువల్ల అటువంటివారు తమలో ఉన్న ఆత్మ స్వరూపుడైన పరమాత్మను తెలిసికోలేక విషయాభిలాషులై ప్రవర్తిస్తూ జీవితం గడుపుతున్నారు.

11. అభిధ్యావై ప్రథమం హన్తి చైనం
కామ క్రోధా వనుగృహ్యాశు పశ్చాత్
ఏతే బాలాన్ మృత్యవే ప్రాపయన్తి
ధీరాస్తు ధైర్యేణ తరంతి మృత్యుమ్

ఆ విషయాభిలాష ముందుగా మానవుణ్ణి వికారంతో నశింప చేస్తోంది. ఆ తరువాత కామము, అటు పిమ్మట క్రోధము క్రమక్రమంగా లోబరుచుకొంటున్నాయి. ఆ విధంగా లోబడిన అజ్ఞానులు మృత్యువు దగ్గరకే చేరతున్నారు. కాని ధీరులు మాత్రం ధైర్యంగా విషయాభిలాషను జయించి మృత్యువును దాటుతున్నారు.

పరాచః కామాననుయంతి బాలాః
తే మృత్యోర్యాంతి వితతస్య పాశమ్
అథ ధీరా అమృతత్వం విదిత్వా
ధ్రువ మధ్రువేష్విహ న ప్రార్థయంతే

— కఠోపనిషత్తు

బాలురు అంటే అజ్ఞానులు బహిర్ముఖానుభవ యోగ్య కాంక్షల ననుసరిస్తూపోయి మృత్యువు పరచిన పాశాలలో పడిపోతారు. అలాగాక ధీరులు అమృతత్వం ధ్రువమైనదని అధ్రువజాలంలో ఉండికూడా ఐహిక కాంక్షలు కోరుకోరు.

12. యోఽభిధ్యాయ న్నుత్పతిష్ణూ న్నిహన్యా
దనాదరేణా ప్రతిబుధ్య మానః
నైనం మృత్యుర్మృత్యురివాత్తి భూత్వా
హ్యేవం విద్వాన్ యో వినిహంతి కామాన్

ఓ రాజా! మృత్యువును జయించాలనుకొనేవాడు విషయ వాసనలను తుచ్ఛంగా భావిస్తాడు. ఆ కోరికలు పుట్టుతుండగనే వాటిని నశింపజేస్తాడు. విద్వాంసుడైనవాడు విషయ వాసనలను అనాదరంతో లెక్కచేయకుండా ఉంటాడు. ఇలాంటి జీవుడికి సాధారణ ప్రాణులకుండే మృత్యువు ఉండదు. ఈ విధంగా తెలిసికొని కామాన్ని ఎవడు జయిస్తాడో వాడు మృత్యువునకే మృత్యువవుతున్నాడు.

13. కామానుసారీ పురుషః కామాననువినశ్యతి
కామాన్ వ్యుదస్య ధునుతే యత్కించిత్ పురుషో రజః

రాజా! కోరికల వెంట పరుగులెత్తే వాడు కోరికలతో నశిస్తాడు. కానీ జ్ఞాన పురుషుడు విషయాలలోని దోషాలను గ్రహించి వాటిని పరిత్యజిస్తున్నాడు. దానివల్ల అతడు జన్మ జన్మాంతరాల్లో చేసికొన్న కర్మలను నశింపచేసికొని ఉత్తముడౌతున్నాడు.

14. దేహో ప్రకాశో భూతానాం నరకోఽయం ప్రదృశ్యతే
గృహ్ణంత ఇవ ధావంతి గచ్ఛన్తః శ్వభ్రమున్ముఖాః

ఓ రాజా! మానవదేహం మలమూత్ర రక్త శ్లేష్మాది మయమై నరకమే ననిపి స్తుంది. ఇంత పిహ్యాభావం కలిగిస్తున్నప్పటికీ కన్నులు కనిపింపనివారు పోయిపోయి నూతిలో పడినట్లుగా విషయాంధులైనవారు విషయసుఖాలనే నరక కూపాలలో పడి పతనమై పోతున్నారు.

15. అమన్యమానః క్షత్రియ కించిదన్య
న్నాధీయతే తార్ణ ఇవాస్య వ్యాఘ్రః
క్రోధాల్లోభాన్ మోహ భయాంతరాత్మా
సవై మృత్యు స్త్వచ్ఛరీరే య ఏషః

ఓ ధృతరాష్ట్రా! విషయ భోగాసక్తుడై, కామాసక్తి చిత్తుడై యున్నవాడు తన ఆత్మ స్వరూపమే అయిన పరమాత్మను గ్రహింపలేడు. అట్టివాడు అధ్యాత్మ శాస్త్రాన్ని అధిగమింపజాలడు. వాని దేహం గడ్డితో తయారుచేసిన వ్యాఘ్రంవలె నిష్ప్రయోజన మయినది. అటువంటి వానికి క్రోధ లోభాల వల్ల మోహ భయముల నొందిన అంతః కరణమే మృత్యువై వానిని నశింపచేస్తుంది.

16. ఏవం మృత్యుం జాయమానం విదిత్వా
జ్ఞానే తిష్ఠ న్నబిభేతీహ మృత్యోః
వినశ్యతే విషయే తస్య మృత్యు
ర్మృత్యో ర్యథా విషయం ప్రాప్య మర్త్యః

ఈ ప్రకారంగా కామక్రోధాదుల వల్ల ఏర్పడే మృత్యువును తెలిసికొని జ్ఞాన నిష్ఠ గలవాడు ఈ లోకంలో మృత్యువుకు భయపడడు. ఆ జ్ఞానం వల్ల పరమాత్మ

సాక్షాత్కారం కలుగుతుంది. అందువల్ల అతని దగ్గరకు వచ్చికూడా మృత్యువు— సంసారంలో మనుష్యుడు నశించిపోయేవిధంగా తానే నశించిపోతుంది.

ధృతరాష్ట్ర ఉవాచ—

17 యానే వాహు రిజ్యయా సాధులోకాన్
ద్విజాతీనాం పుణ్యతమాన్ సనాతనాన్
తేషాం పరార్థం కథయంతీహ వేదా
ఏతద్విద్వా న్నైతి కథంను కర్మ

మహాత్మా! జ్యోతిష్టోమాది యాగాలు చేసిన ద్విజులకు శాశ్వతమైన ఉత్తమ లోకాలు కలుగుతాయని అంటారు గదా. అటువంటి కర్మలు పరమ పురుషార్థాలని వేదాలుకూడ ప్రశంసించాయిగదా. మరి ఈ విషయాలన్నీ తెలిసికొనికూడ విద్వాంసుడు అటువంటి ఉత్తమ కర్మలను ఎందువల్ల ఆచరించటంలేదు అని ధృతరాష్ట్రుడు సనత్సుజాత మహర్షిని ప్రశ్నించాడు.

సనత్సుజాత ఉవాచ—

18 ఏవం హ్యవిద్వా నుపయాతి తత్ర
తత్రార్థజాతం చ వదంతి వేదాః
సనేహ ఆయాతి పరం పరాత్మా
ప్రయాతి మార్గేణ నిహంత్యమార్గాన్

సనత్సుజాతుడు ఇలా సమాధానం చెప్పాడు— మహారాజా! నీవు చెప్పింది నిజమే. కాని విద్వాంసుడు బ్రహ్మాదిలోకాల్లో ఉన్న అనిత్యమైన ఫలాల నపేక్షించి కర్మల నాచరింపడు. అవిద్వాంసుడే అటువంటి అనిత్యఫలాలకోసమై కర్మల నాచరిస్తాడు. వేదాలు కూడ అటువంటి వారిని గురించే చెప్పాయి. కాబట్టి జ్ఞాని అయిన వాడు ఇటువంటి కర్మలపై ఆసక్తి చూపించకుండ తన ఆత్మనే పరమాత్మగా భావించి, చెడు మార్గాలు నిరసించి, జ్ఞానం ద్వారానే మోక్షాన్ని పొందుతాడు.

ధృతరాష్ట్ర ఉవాచ—

19 కోవా నియుంక్తే తమజం పురాణం
స చేదిదం సర్వమనుక్రమేణ
కింవాస్య కార్య మథవా సుఖంచ
తస్మై విద్వన్ బ్రూహి సర్వం యథావత్

ఆ మాటలువిని ధృతరాష్ట్రుడు మరల ఇలా ప్రశ్నించాడు—ఓ విద్వాంసుడా! ఆ పరమాత్ముడే ఈ ఆకాశాది పృధివ్యంతమైన సృష్టిని చేయటం ఏ ప్రయోజనం కోసం? అజుడు, సనాతనుడు అయిన ఆ పరమాత్మను ఈవిధంగా సృష్టిచేయమని ఎవరు ఆజ్ఞాపిస్తున్నారు? ఇలా సృష్టిచేయటంవల్ల ఆయనకు ఆనందం కలుగుతోందా? వివరపరచవలసింది.

సనత్సుజాత ఉవాచ—

20 దోషో మహానత్ర విభేద యోగే
హ్యనాది యోగేన భవంతి నిత్యాః
తథాస్య నాధిక్య మపైతి కించి
దనాదియోగేన భవంతి పుంసః

ఆ మాటలు విని సనత్సుజాతుడు ఇలా పలికాడు—పరమాత్మ తానొకరిచే నియోగింపబడటంగాని, తానొకరిని నియమించటంగాని లేదు. అవిధంగా చెప్పినట్లయితే అఖండుడైన ఆ పరమాత్మకు నానా రూపాలు కల్పించినట్లవుతుంది. ఆ విధంగా చెప్పటం దోషమవుతుంది. ఈ సృష్టి స్థితి సంహారాలు అనాదిగా ఆ పరమాత్మవి కావటంవల్ల ఇవి నిత్యములే. పరమాత్మ అద్వితీయుడే అయినా మాయా యోగంవల్ల ఆయనకు బహు రూపత్వం కల్పింపబడుతోంది. అందువల్ల కారణాత్మకంగా పరమేశ్వరుడు, కార్యాత్మకంగా జీవుడు అవుతున్నారు. కారణమైన పరమాత్మ కార్యమైన జీవుణ్ణి నియోగిస్తున్నాడు. అయినా పరమాత్మ తనయందు ఆధిపత్యాన్ని ఎప్పుడూ చూపించడు. అనాదియైన అవిద్యాయోగం వల్ల, మాయవల్ల జీవులు అనేక విధాలుగా సంసార బంధాలలో నిమగ్నులౌతున్నారు.

21 యదేతదర్ధా భగవాన్ సనిత్యో
వికారయోగేన కరోతి విశ్వం
తథాచ తచ్ఛక్తిరితి స్మమన్యతే
తథార్థయోగేచ భవంతి వేదాః

మహారాజా ! ఆ భగవంతుడు నిత్యుడు, నిరంజనుడు. ఆ భగవంతునిలోని వికారయోగం అంటే మాయాశక్తి ఈ సృష్టిని చేస్తోంది తప్ప ఆ పరమాత్మ కాదు చేసేది. కారణత్వం లేని ఆ పరమాత్మకు అటువంటి మాయాశక్తి ఉంది. అందుకు ప్రమాణం వేదములే.

ధృతరాష్ట్ర ఉవాచ—

22 యస్మా ద్ధర్మా న్నాచరంతీహకే చిత్తథా
ధర్మాన్ కేచి దిహాచరంతి
ధర్మః పాపేన ప్రతిహన్య వాఉతాహో
ధర్మః ప్రతిహంతి పాపమ్

ధృతరాష్ట్రుడిలా ప్రశ్నించాడు—ఓ సనత్సుజాతా! లోకంలో కొందరు అగ్నిష్టోమాది రూపాలైన ధర్మకార్యాలు ఆచరిస్తున్నారు. మరికొందరు అధర్మములను చేస్తున్నారు. మరి అటువంటప్పుడు ధర్మం పాపాన్ని నశింపచేస్తుందా? లేక పాపమే ధర్మాన్ని నశింప చేస్తుందా?

సనత్సుజాత ఉవాచ—

23 తస్మిం స్థితో హ్యుభయం హి నిత్యం
జ్ఞానేన విద్వాన్ ప్రతిహంతి సిద్ధం
యథాన్యథా పుణ్య ముపైతి దేహీ
తథాగతం పాప ముపైతి సిద్ధమ్

సనత్సుజాత మహర్షి ఇలా సమాధానం చెప్పాడు—ఓ ధృతరాష్ట్రా! నీవు చెప్పిన రెండు విధాలైన ధర్మాధర్మ కర్మములు ఉన్నాయి. ధర్మ కర్మమునకు పుణ్యము, అధర్మ కర్మమునకు పాపము ఫలాలు. ఈ రెండు విధములైన కర్మల నాచరించినా జ్ఞానియైనవాడు తన జ్ఞానాగ్ని చేత కర్మను నాశనం చేసికొని కర్మ ఫలాల

ననుభవింపడు. అజ్ఞాని జ్ఞాన హీనుడు కాబట్టి ధర్మకర్మమునకు పుణ్యము, అధర్మ కర్మమునకు పాపము అనుభవిస్తున్నాడు.

24 గత్వోభయం కర్మణాయుజ్యతే స్థిరం
శుభస్య పాపస్య సచాపి కర్మణా
ధర్మేణపాపం ప్రణుదతీహ విద్వాన్
ధర్మో బలీయానితి తస్య సిద్ధిః

పుణ్యఫలంగాని, పాపఫలంగాని ఏదైనాసరే దేహి దేహత్యాగానంతరం పరలోకంలో అనుభవించక తప్పదు. కాని జ్ఞానియైనటువంటివాడు ఇహ లోకంలోనే ఈశ్వరార్పణంగా కర్మల నాచరించి ఆ పుణ్య కర్మలచేత పాప కర్మఫలాన్ని పోగొట్టుకొంటున్నాడు. కాబట్టి ధర్మమే బలవత్తరమని సారాంశం. దీనికి వేదములు కూడ ప్రామాణంగా ఉన్నాయి.

ధృతరాష్ట్ర ఉవాచ—

25 యానీహాహుః స్వస్యధర్మస్య లోకాన్
ద్విజాతీనాం పుణ్యకృతాం సనాతనాన్
తేషాంక్రమాన్ కథయ తతోపిచాన్యా
న్నైతద్విద్వన్ వేత్తు మిచ్ఛామి కర్మ

ధృతరాష్ట్ర మహారాజా ఇలా అన్నాడు—మహర్షీ! విద్వాంసులై పుణ్యకర్మలు చేసే బ్రాహ్మణులకు వారి వారి ధర్మస్వరూపం అనుసరించి సనాతన లోకాలు ప్రాప్తిస్తాయి అని చెప్పబడింది. ధర్మ కర్మలవల్ల ప్రాప్తించే ఆ లోకాలు ఏమిటో అలా కాకుండగా పాపకర్మల నాచరించేవారికి కలిగే లోకాలు ఏమేమి ఉన్నాయో నాకు తెలిసికొనవలెనని ఉంది మహాత్మా!

సనత్సుజాత ఉవాచ—

26 యేషాం ధర్మేషు విస్పర్ధా బలే బలవతా మివ
తే బ్రాహ్మణా ఇతః ప్రేత్య స్వర్గే యాంతి ప్రకాశతామ్

సనత్సుజాతుడు ఇలా బోధించసాగాడు— రెండు బలవత్తర శక్తులు తమ తమ బలం పెంచుకోవటానికి ఒకటి రెండవ దానిపై స్పర్ధ పూనుతుంది. అదేవిధంగా

ఎక్కువ సుఖాన్ని సంపాదించాలనే స్పర్ధతో ఎవరు ఎక్కువ సత్కర్మల నాచరిస్తారో అటువంటి బ్రాహ్మణులు మరణానంతరం స్వర్గాన్ని పొంది ఆకాశంలో నక్షత్రరూపంగా ప్రకాశిస్తూ ఉంటారు.

27 యేషాం ధర్మే నచ స్పర్ధా తేషాం తద్జ్ఞాన సాధనం
తే బ్రాహ్మణా ఇతో ముక్తాః స్వర్గం యాంతి త్రివిష్టపమ్

అటువంటి స్పర్ధపూనకుండగ యజ్ఞయాగాది పుణ్యకర్మల నాచరించే వారికి ఆ యజ్ఞ యాగాది సత్కర్మలు చిత్త శుద్ధిని కలిగిస్తాయి. తద్వారా వారికి జ్ఞానం కలుగుతుంది. తమ ఆత్మయే పరమాత్మ అనే విషయం వారికి అవగతమౌతుంది. అటువంటి వారు ఇహ లోకం వదిలిన తరువాత ముక్తులై స్వర్గంలో ఆనందాన్ని అనుభవిస్తారు

28 తస్య సమ్యక్ సమాచార మాహుర్వేదవిదో జనాః
నైనం మన్యేత భూయిష్ఠం బాహ్యమాభ్యంతరం జనమ్

ఇక జ్ఞానుల తత్వమును గురించి విను. వారి గురించి వేదవిదులు వచించారు. జ్ఞానుల వర్తనం బాహ్యజనులుగాని, పుత్ర మిత్ర కళత్రాదులు గాని గ్రహింపజాలరు అంటే అటువంటి అంతరంగిక జనులకు కూడ వారు అగోచరులుగా ప్రవర్తిస్తారని సారాంశం.

29 యత్ర మన్యేత భూయిష్ఠం ప్రావృషీవ తృణోదకం
అన్నం పానం బ్రాహ్మణస్య తజ్జీవే న్నాను సంజ్వరేత్

రాజా! వర్ష ఋతువులోని వర్షంలో గడ్డి గాదర సస్య ఫలాలు పెరిగినట్లుగా బ్రాహ్మణుడు అన్న పానాదులు లభించేచోట సుఖజీవనం చేయాలి. తాను ఎక్కడున్నా సరే తన ధర్మం పాటించాలి. తన ధర్మం కర్తవ్యం వదలుకోరాదు. నిరంతరం సంతుష్టిగా భగవచ్చింతనతో ఉండాలి.

30 యత్రాకథయ మాదన్య ప్రయచ్ఛత్యశివం భయమ్
అతిరిక్త మివకుర్వన్ సశ్రేయా న్నేతరో జనః

అటువంటి జ్ఞాన యోగి తమ మాహాత్మ్యాన్ని ప్రకటించుకొనకుండగా, ఎక్కడనో ఒకచోట ఉంటూ లోకమునంతటిని తన ఆత్మ స్వరూపంగానే భావిస్తూ

ఉంటారు. జడ మూక పిశాచాదులవలె పరిభ్రమించే తనను చూచి, తన యథార్థ విషయం తెలియక తనను అగౌరవిస్తూ, సత్కరింపజాలని అజ్ఞానులు ఎక్కడ ఉంటారో వారి మధ్యనే జ్ఞానులు ఉంటారు. అంతేకాని తనను చూచి గౌరవ మర్యాదలు చూపేచోట జ్ఞానులు ఉండటం శ్రేయస్కరం కాదు.

31 యో వా కథయ మానస్య హ్యాత్మానం నానుసంజ్వరేత్
బ్రహ్మస్వం నోపభుంజేత తదన్నం సమ్మతం సతామ్

ఆతనికెటువంటి అన్నము భోజ్యము? అంటే—ఎవ్వడీ జ్ఞాని యొక్క మనస్సునకు బాధ కలుగజేయడో, ఈయన బ్రహ్మనిష్ఠా సాధన భూతములైన కష్టాదికాలను ఎవ్వడు హరింపడో అటువంటి వాడొసగిన ఆహారాన్నే ఈ జ్ఞాని స్వీకరించాలి.

32 నిత్య మజ్ఞాత చర్యా మే ఇతి మన్యేత బ్రాహ్మణః
జ్ఞాతీనాం తు వసన్మధ్యే నైవ విందేత కించన

బ్రహ్మణుడంటే బ్రహ్మవేత్త. అతడు విధివశంవల్ల పుత్ర మిత్ర భ్రాత్రాదుల సన్నిధిలో ఉండవలసివస్తే అతడు తన మనస్సులో నిరంతరం నాకు ఎప్పుడు ఏకాంత వాసం లభ్యమవుతుందా అని కోరుకొంటూ ఉండాలి. అటువంటివానినే విద్వాంసులు బ్రాహ్మణుడని తెలిసికొంటున్నారు. జ్ఞాతి శబ్దానికి ఇంద్రియాలని కూడ అర్థం. ఈ ఇంద్రియాల ధ్యాసనుండి ఎప్పుడు నేను పరబ్రహ్మ ధ్యాసలో లీనమౌతానా అని బ్రహ్మవేత్తలు నిరంతరం ఆలోచిస్తూ ఉంటారని కూడ అర్థం.

కుటుంబం పుత్రదారాంశ్చ వేదాంగాని చ సర్వశః
యజ్ఞం యజ్ఞోపవీతంచ త్యక్త్వా గూఢశ్చరే న్మునిః

కుటుంబాన్ని, పుత్ర భార్యాదులను, వేదాంగాన్ని యజ్ఞాన్ని, యజ్ఞోపవీతాన్ని ముని అయినవాడు గోప్యంగా త్యజిస్తాడని శ్రుతి వచనం.

క్రోధ మానాదయో దోషా విషయాశ్చేంద్రియాణిచ
ఏత ఏవ సమాఖ్యాతో జ్ఞాతయో దేహిన స్సవ

దేహికి క్రోధం సంతోషం దోషాలు విషయేంద్రియాలు జ్ఞాతులవంటివారు. ఈ జ్ఞాతులు విషమువంటి వారు సుమా! ఇటువంటి బ్రాహ్మణుడు పతితుడు. క్రోధాదులు పతనహేతువులని శ్రుతివాక్కు.

33. కోహ్యేవ మంతరాత్మానం బ్రాహ్మణోమంతు మర్హతి
నిర్లింగ మచలం శుద్ధం సర్వదంద్వ వివర్జితమ్

ఇంద్రియాలు చేసే పనులకు ఆత్మసాక్షి గదా. ఇంద్రియాలు చేసే పనులకు ఆత్మ ఏవిధంగా ఆకర్షింపబడకుండా ఉంటుంది? అనే ప్రశ్నకు సమాధానమిది—ఆత్మ స్థూల సూక్ష్మ శరీర వివర్జితం, క్రియా కర్తృత్వాది శూన్యం, అవిద్యాది దోష రహితం, సర్వద్వంద్వ వివర్జితం కాబట్టి అటువంటి అంతరాత్మకు ఇంద్రియాకృష్టత అనేది లేనేలేదు.

34. యోఽన్యథా సంత మాత్మానం అన్యథా ప్రతిపద్యతే
కిం తేన నకృతం పాపం చోరేణాత్మాపహారిణా

బ్రహ్మవేదుడై ఇటువంటివాడు ఈ ఆత్మ తత్వాన్ని తెలిసికొంటాడు. అలాకాక మరొకవిధంగా భావిస్తే అంటే ఆత్మ ఇంద్రియాకృష్టమని, దేహమే ఆత్మ అని భావిస్తే అతనికి బ్రహ్మజ్ఞానం నశించిందనే అర్థం ఆత్మాపహారియైన అటువంటి వాని చేత ఏ పాపమైనా చేయబడుతుంది.

35. అశ్రాంతః స్యాద నాదాతా సమ్మతో నిరుపద్రవః
శిష్టో నశిష్ట వత్సస్యా ద్బ్రాహ్మణో బ్రహ్మవిత్కవిః

దేహమే ఆత్మ అని భావించకుండగా ఆత్మను పరమాత్మగా భావించినవాడు సంసార శ్రమలనుంచి విముక్తుడౌతాడు. అటువంటివానికి ఎటువంటి ఉపద్రవాలు ఉంటవు. పైకి అతడు శిష్టుని వలె కనిపింపకూడదు. అయినా విజ్ఞులైనవారు అతడు బ్రహ్మవేత్త అని గుర్తిస్తారు.

"అశనాయాపి పాసే ప్రాణస్య శోక మోహౌచమానసః
జరా మరణే శరీరస్య...."

ఆకలి దాహాలు ప్రాణధర్మాలు. శోక మోహాలు మనో ధర్మాలు. జరా మరణాలు శరీర ధర్మాలని శ్రుతి.

36. యే యథా వాంత మశ్నంతి శ్వానో నిత్య మభూతయే
ఏవం తే వాంత మశ్నంతి స్వవీర్య స్యోప సేవనాత్

బ్రహ్మవేత్త అయినవాడు గూఢ వర్తనతో ఉండాలి. తాను బ్రహ్మజ్ఞుడనని తన ప్రతిభ తాను ప్రకటింపుకొంటూ దానివల్ల ఆహారాన్ని సంపాదించుకొని తినేవాడు తాను క్రక్కిన దానిని తానే తినే శునకం వంటి వాడని భావించారు. కాబట్టి బ్రహ్మవేత్త తనను తాను ప్రకటించుకొనకుండగా గూఢంగా ఉండటమే శ్రేయస్కరము.

37. అనాఢ్యా మానుషే విత్తేః ఆఢ్యా వేదేషు యే ద్విజాః
తే దుర్ధర్షా దుష్ప్రకంప్యాస్తాన్ విద్యాత్ బ్రహ్మణ స్తనుమ్

రాజా! లౌకికంగా ధనం లేనివాడైనాకూడ వేదాది విద్యలు నేర్చిన జ్ఞాన పురుషుడు దుర్ధర్షుడు. అతడు ఎట్టి ఆపదలకు చలించని దీక్షతో బ్రహ్మజ్ఞానంలో ఉంటాడు. అతడు బ్రహ్మదేవునిగా కొలువబడతాడు.

38. సర్వాన్ స్విష్టకృతో దేవాన్ విద్యాద్య ఇహ కశ్చన
న సమానో బ్రాహ్మణస్య తస్మిన్ ప్రయతతే స్వయమ్

ఓ రాజా! ఈ లోకంలో అభీష్టసిద్ధికి అనేక దేవతలను ఉపాసనతో ప్రసన్నం చేసికొంటారు కొందరు మంత్రవేత్తలు. కాని వారు బ్రహ్మవేత్తలుకారు. ఏలనంటే ఆ ఉపాసకులు అభీష్టఫలసిద్ధి కోసమే ప్రయత్నిస్తున్నారు. వారేకాదు. వారికి వరాలను ప్రసాదించే దేవతలు కూడ బ్రహ్మవేత్తకు సమానులు కారు.

"బ్రహ్మ విద్భ్యః పరంభూతం నకించిదిహ విద్యతే"

—మనుస్మృతి

బ్రహ్మవిదులను మించినవారు జగత్తులో ఎవరూలేరు. వారజేయులు.

39. య మప్రయతమానం తు మానయంతి స మానితః
న మాన్యమానో మన్యేత నావమానే నుసంజ్వరేత్

ఓ రాజా! బ్రహ్మవేత్త ఈ విధంగా గూఢంగా ఉన్నప్పటికీ కొందరు విజ్ఞులాయనను గుర్తించి గౌరవిస్తారు. వారిచే పూజితుడైనప్పటికీ నన్ను సత్కరిస్తున్నారుగదా అని బ్రహ్మవేత్త ఉబ్బిపోడు. ఎవరైనా తనను నిందించినా, అవమానించినా

అందుకు దుఃఖించడు. మానావమానముల రెండింటిని బ్రహ్మజ్ఞాని సమానంగానే భావిస్తాడు.

40. లోక స్వభావ వృత్తిర్హి నిమిషోన్మేషవ త్సదా
విద్వాంసో మానయంతీహ ఇతి మన్యేత మానితః

ధృతరాష్ట్ర మహారాజా ! బ్రహ్మజ్ఞానియైనవాడు తాను పూజితుడయినప్పుడు "విద్వాంసులు బ్రహ్మవేత్తలను పూజించుట కనులు మూయుట తెరచుటవలె స్వభావ సిద్ధంగదా" అని భావించాలి.

41. అధర్మవిదుషో మూఢా లోకశాస్త్ర వివర్జితాః
సమాన్యం మానయిష్యంతి మాన్యానా మవమానినః

బ్రహ్మజ్ఞానియైనవాడు తనను ఎవరైన దూషించినప్పుడు "వీరు అధర్మమునే ఎఱిగినవారు. వీరికి లోకశాస్త్ర మర్యాద తెలియదు అందువల్ల వీరికి గౌరవింపదగిన వారిని గౌరవించటం తెలియదు. పూజ్యులను పూజింపకపోవటం వీరికి సహజగుణం గదా" అని భావించాలి.

42. నవై మానం చ మౌనంచ సహితౌ వసత స్సదా
అయం హి లోకో మానస్య అసౌ మానస్య తద్విదుః

రాజా! లోకంలో మానం మౌనం ఒకచోటదగ్గరుండవు. మానంవల్ల ఈ లోకంలో సుఖ సౌఖ్యాలు లభిస్తుంటాయి. మౌనంవల్ల పరలోకంలో ఆనందప్రాప్తి కలుగు తుంది. అంటే మానంవల్ల సంసార ప్రాప్తి, మౌనంవల్ల బ్రహ్మప్రాప్తి కలుగు తుందని సారాంశం.

"ఓం తత్సదితినిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్మృతః"
ఓం తత్ సత్ అను మూడూ బ్రహ్మకు మూడు విధాలైన నిర్దేశాలనీ భగవద్గీత.

అన్మింగ సోదీ భోగేషు భావో మౌన ఇతి స్మృతః
బ్రహ్మానంద సుఖప్రాప్తి హేతు ర్మౌన మితిస్మృతః

—హిరణ్యగర్భసంహిత

ఆహారం, అతిప, భోగం వీనియందు మనస్సు రమించటం మానం అనీ; బ్రహ్మానంద సుఖంలో మనస్సు లగ్నం కావటం మౌనం అని స్మృతి ప్రమాణం.

43. శ్రీర్హి మానార్థ సంవాసా త్స్వాచాపి పరిపంథినీ
బ్రాహ్మీ సుదుర్లభా శ్రీర్హి ప్రజ్ఞాహీనేన క్షత్రియ

ఓ రాజా! మానాన్ని కోరి అంటే ఇహలోక సుఖాలు కోరి కర్మల నాచరించే వానికి ఆయా సంపదలు కలుగుతాయి. కాని అవి యోగమార్గానికి ఆటంకం కలిగించేవే కాని సాధకాలు కావు జ్ఞానహీనుడు ఆ ఐహికమైన ఐశ్వర్యాలను పొంది బ్రహ్మజ్ఞాన సంపద పొందటానికి అశక్యుడవుతున్నాడు.

44. ద్వారాణి తస్యేహ వదంతి సంతో
బహు ప్రకారాణి దురాసదాణి
సత్యార్జవే హ్రీ ర్దమ శౌచ విద్యా
షణ్మాన మోహ ప్రతిబంధకాని

ఓ ధృతరాష్ట్ర మహారాజా! బ్రహ్మజ్ఞానశ్రీ పొందటానికి సాధు పురుషులు అనేక మార్గాలు వివరిస్తారు. అవి సత్యము (ప్రాణులకు హితం కలిగించే యదార్థం చెప్పటం), ఆర్జవము (లోపల బయట ఒకటిగా ప్రవర్తించే సరళత్వం), హ్రీ (అకార్యాలను చేయటంలో సిగ్గు), దమము (బాహ్యేంద్రియములను నిగ్రహించటం), శౌచము (నిర్మలుడై ఉండటం), విద్యా (బ్రహ్మజ్ఞానం) ఈ ఆరు బ్రహ్మజ్ఞాన సంపద పొందటానికి ప్రవేశ ద్వారాలు. ఇవి ఇతరులు పొందనలవికానివి, మాన మోహ ప్రతిబంధకాలు. మహాత్ములు ఈ ద్వారాల ద్వారానే బ్రహ్మానంద సుఖాన్ని పొందుతున్నారు. ఇది నిశ్చయం!

## "దుర్గుణాలను పరిత్యజించు!"

ధృతరాష్ట్ర ఉవాచ—

1. కస్యైష మోహం? కతరంను మౌనం?
   ప్రబ్రూహి విద్వన్నిహ మౌన భావం
   మౌనేన విద్వానుతయాతి మౌనం
   కథం మునే మౌన మిహాచరంతి

ధృతరాష్ట్ర మహారాజు సనత్సుజాత మహర్షిని ఇలా ప్రశ్నించాడు — విద్వద్వరేణ్యా! మౌనమంటే ఎటువంటిది? మౌన స్వభావము ఏమిటి? విద్వాంసుడు మౌనంచేత పరబ్రహ్మమును పొందగలడా? ఇతరులు మౌనము నే విధంగా ఆచరిస్తున్నారు? ఈ విషయం నాకు తెలియజేయి.

సనత్సుజాత ఉవాచ—

2. యతో నవేదా మనసా సహైనే
   మను ప్రవిశంతి తతోథ మౌనం
   యత్రోత్థితో వేదశబ్ద స్తథాయం
   తన్మయత్వేన విభాతి రాజన్

సనత్సుజాతు డీ విధంగా పలికాడు—ధృతరాష్ట్ర మహారాజా! వేదాలు కానీ, మనస్సుకానీ పరమాత్మను చెందలేకపోయినాయి. అందువల్ల మౌన శబ్దానికి పరమాత్మ అర్థమయినాడు. ఆ పరమాత్మను వేదాలు సమగ్రంగా తెలిసికొనలేకపోయినాయి. మనస్సు తెలిసికొనలేకపోయింది. అయినప్పటికీ పరమాత్మను తెలిసికొనటానికి వేదమే ఆధారమయింది. అందువల్ల ఆ భగవంతుణ్ణి వేదమయుడని అన్నారు.

ధృతరాష్ట్ర ఉవాచ—

3. ఋచో యజూంష్యధీతే యం
స్సామ వేదం చ యో ద్విజః
పాపాని కుర్వన్ పాపేన
లిప్యతే స న లిప్యతే

ధృతరాష్ట్ర మహారాజు అడిగిని వేద స్వరూపం తెలిసికొనటం కోసం ఒక సందేహం వెలిబుచ్చాడు—

ఓ విద్వద్వరేణ్యా! కొందరు బ్రాహ్మణులు ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం చదివి వాటి రహస్యాలు, ధర్మాలు, మహాత్మ్యాలు తెలిసికొంటున్నారు కదా! వారు పాపాలు చేస్తే ఆ పాప ఫలం వారిని చుట్టుకొంటుందా? లేదా? ఆ వేద విద్యలను ఆ పాపం బాధిస్తుందా? బాధించక విడిచిపెడుతుందా?

సనత్సుజాత ఉవాచ—

4. నైనం సామాన్యృచో వాపి యజూంషిచ విచక్షణం
త్రాయతే కర్మణః పాపాన్నతే మిథ్యా బ్రవీమ్యహమ్

సనత్సుజాత మహర్షి ఇలా చెప్పారు— ఓ రాజా! నీకు నిజం చెప్తున్నాను విను. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం ఏది చదువుకొన్న వాడైనా పాపాలుచేస్తే వాడిని పాపం చుట్టుకోకుండా ఉండదు. అప్పుడు ఏ వేదాలు వాణ్ణి రక్షించలేవు పాప ఫలం పుణ్యకర్మ వల్ల తగ్గదు. పాపఫలం అనుభవించక తప్పదు. ఆ అజ్ఞానిని పాపం నుంచి ఎవరూ రక్షించలేరు.

5. న ఛందాంసి వృజినం తారయంతి
మాయావినం మాయయా వర్తమానం
నీడం శకుంతా ఇవ జాతపక్షాః
ఛందాంస్యేనం ప్రజహంత్యంతకాలే

ఓ రాజా! కపటంగా ధర్మాచరణ చేసే మిథ్యాచారుణ్ణి వేదవిద్య కాపాడలేదు. ధర్మంమీద శ్రద్ధలేకుండా, మాయా ప్రవర్తమానుడై యుంటే అతడు వేదవిదుడై యున్నాకూడ ఆ వేదాలు అతణ్ణి రక్షించలేవు. రెక్కలువచ్చిన పక్షి గూడువిడిచి పోతున్నట్లు అతని చివరి కాలంలో వేదాలు అతణ్ణి విడిచి వెళ్ళిపోతాయి.

ధృతరాష్ట్ర ఉవాచ—

6. నచే ద్వేదా వేద విదం త్రాతుం శక్తా విచక్షణ
అథ కస్మాత్ప్రలాపోఽయం బ్రాహ్మణానాం సనాతనః

అదివిని ధృతరాష్ట్ర మహారాజు ఇలా తన సందేహాన్ని వ్యక్తంచేశాడు—ఓ విద్వత్పురుషాగ్రణీః వేదాలు కూడ ఆ వేదవేత్తను కాపాడటానికి సమర్థం కాక పోతే సనాతన కాలంనుంచి బ్రాహ్మణోత్తములు వేదాలను అధ్యయనం చేయటం ఎందుకు?

సనత్సుజాత ఉవాచ—

7. తస్యైవ నామాది విశేష రూపై
రిదం జగద్భాతి మహానుభావ
నిర్దిశ్య సమ్యక్ప్రవదంతి వేదా
స్తద్విశ్వ వైరూప్య ముదాహరంతి

ఓ మహానుభావా! ఆ పరమాత్మవివల్ల కలిగిన నామరూపాది విశేషాలతోనే ఈ జగత్తంతా ప్రకాశిస్తోంది. కాబట్టి ఈ జగత్తు పరమాత్మ స్వరూపమే. ఈ విషయాన్ని వేదాలు కూడ చక్కగా బోధిస్తున్నాయి. మహర్షులు కూడ ఈ జగత్తు పరమాత్మ స్వరూపమే కాని ఆ పరమాత్మ జగత్తు కంటె భిన్నమంటునవాదని పలుకుతున్నారు.

8. తదర్థ ముక్తంతప ఏత దిజ్యాతాభ్యాం
అసౌ పుణ్య ముపైతి విద్వాన్
పుణ్యేన పాపం వినిహత్య పశ్చాత్
సజాయతే జ్ఞాన విదీపితాత్మా

తపస్సు, యజ్ఞము భగవంతుని కోసమని వేదాలు వచించినాయి. విద్వాంసుడు ఆ తపో యజ్ఞాల నాచరించి వాటి వల్ల పుణ్యాన్ని పొందుతున్నాడు. ఆ పుణ్యంవల్ల పాపాన్ని పోగొట్టుకొని భగవత్ జ్ఞానాన్ని పొంది విశిష్టుడుగా ప్రకాశిస్తున్నాడు. కాబట్టి వేదాలలో చెప్పినట్లుగా "ఆచరించటం వల్ల" ప్రయోజనం కలుగుతున్నది గాని కేవలం వేదాధ్యయనం వల్ల ప్రయోజనం లేదు.

9. జ్ఞానేన చాత్మాన ముపైతి విద్వాన్
అథాన్యథా వర్గ ఫలాను కాంక్షీ
అస్మిన్ కృతం తత్పరిగృహ్య సర్వం
అముత్ర భుంక్తే పునరేతి మార్గమ్

ఈ విధంగా విద్వాంసుడు భగవదారాధనా కాంక్షతో తపస్సు, యజ్ఞం మొదలైన సత్కర్మల నాచరించి జ్ఞానం పొంది దాని ద్వారా పరమాత్మను పొందుతున్నాడు. ఇలా కాక కేవలం స్వర్గాది ఫలాల్ని కోరి కర్మల నాచరించేవాడు తాను సంపాదించుకొన్న పుణ్యంతో స్వర్గఫలాన్ని అనుభవించి మరల ఈ లోకంలోకి వచ్చి జనన మరణ రూపమైన సంసార మార్గాన్ని పొందుతున్నాడు.

10. అస్మిన్ లోకే తపస్తప్తం ఫల మన్యత్ర భుజ్యతే
బ్రాహ్మణానాం తపస్త్వృద్ధ మన్యేషాం తావదేవ తత్

ఓ రాజా! సామాన్యులు ఫలాకాంక్షతో తపస్సు చేస్తే అది పరలోకంలో ఫలవంతమవుతుంది. కానీ బ్రహ్మోపాసకులు నిష్కామ భావంతో తపస్సు చేస్తే వారు తత్వజ్ఞానరూపంలో మోక్షరూపంలో ఫలం పొందుతారు, ముక్తులవుతారు. సామాన్యులు చేసిన తపస్సునకు ఎంత ఫలమో అంతే ఫలం లభిస్తుంది. బ్రహ్మజ్ఞానులు చేసిన తపస్సునకు విశేష ఫలం ప్రాప్తిస్తుంది. ఈ విధంగా ఒకే తపస్సు ఋద్ధంగా సమృద్ధంగా రెండు తీరులలోను ఫలిస్తుంది.

ధృతరాష్ట్ర ఉవాచ—

11. కథం సమృద్ధమప్యృద్ధం తపో భవతి కేవలమ్
సనత్సుజాత తద్బ్రూహి కథం విద్యా మహం ప్రభో!

ధృతరాష్ట్ర మహారాజు ఇలా ప్రశ్నించాడు— ఓ సనత్సుజాత మహర్షీ! ఒకే రకమైన తపస్సు ఋద్ధం సమృద్ధం ఎలా అవుతుంది? నాకు వివరంగా బోధించు.

సనత్సుజాత ఉవాచ—

12. నిష్కల్మషం తప స్త్వేత త్కేవలం పరిచక్షతే
ఏత త్సమృద్ధ మప్యృద్ధం తపో భవతి కేవలమ్

సనత్సుజాతుడు ఇలా సమాధానం చెప్పాడు— ఓ రాజా! నిష్కల్మషమైన ఈ తపస్సును కేవలమని అన్నారు. ఈ కేవలమైన తపస్సే ఋద్ధమని, సమృద్ధమని రెండువిధాలు. నిష్కల్మషం కాకపోతే ఆ తపస్సు ఋద్ధముకాని సమృద్ధము కాని కాదు.

13. తపోమూల మిదం సర్వం యన్మాం పృచ్ఛసి క్షత్రియ!
తపసాహ్యేవ విద్వాంసః పరం త్వమృత మాప్నుయుః

మహారాజా! నీవు అడిగిన ఫలాలను ప్రసాదించటానికి సర్వ సమర్థమయినది తపస్సే. ఈ ప్రపంచమంతా తపస్సు మూలంగానే నడుస్తున్నది. విద్వాంసులు ఈ తపస్సు ద్వారానే శ్రేష్ఠమయిన అమృతత్వాన్ని, మోక్షాన్ని పొందుతున్నారు.

ధృతరాష్ట్ర ఉవాచ—

14. కల్మషం తపసో బ్రూహి శ్రుతం నిష్కల్మషం తపః
సనత్సుజాత యేనేదం విద్యాం గుహ్యం సనాతనమ్

ధృతరాష్ట్రుడది విని ఇలా ప్రశ్నించాడు— ఓ సనత్సుజాత మహర్షీ! నీ అనుగ్రహం వల్ల నిష్కల్మషమైన తపస్సు యొక్క ప్రకారం విన్నాను. తపస్సు యొక్క కల్మషము ఏమిటో నాకు తెలిసికొనాలని ఉన్నది. సనాతనమైన ఈ రహస్యం నాకు ఉపదేశించు.

సనత్సుజాత ఉవాచ—

15. క్రోధాదయో ద్వాదశ యస్య దోషా
స్తథా నృశంసాని చ సప్త రాజన్
జ్ఞానాదయో ద్వాదశ వా తతానాః
శాస్త్రే గుణా యే విదితా ద్విజానామ్

సనత్సుమహాజాత్సర్షి ఇలా సమాధానం చెప్పాడు— ఓ రాజా! తపస్సులో క్రోధాదులు పన్నెండు దోషాలు ఉన్నాయి, నృశంస దోషాలు ఏడు ఉన్నాయి. అలాగే

ధర్మము, మొదలైన పన్నెండు గుణాలు ఉన్నాయి. ఆ గుణాలు బ్రాహ్మణ ధర్మాలుగా విఖ్యాతమై విరాజిల్లుతున్నాయి.

16. క్రోధః కామో లోభ మోహౌ విధిత్సా
కృపాసూయా మానరోషౌ స్పృహాచ
ఈర్ష్యా జుగుప్సాచ మహాగుణేవ
సదావర్జ్యా ద్వాదశైతే నరేణ

ఓ రాజా! క్రోధం, కామం, లోభం, మోహం, విషయసుఖాపేక్ష, అకృప, అసూయ, గర్వం, రోషం, స్పృహ, ఈర్ష్య, జుగుప్స ఈ పన్నెండు దోషాలు మనుష్యునిలో ఉంటాయి. ఇవి దుర్గుణాలు కాబట్టి ఉత్తముడు వీటిని వదిలివేయాలి.

17. ఏకైకమేతే రాజేంద్ర! మనుష్యం పర్యుపాసతే
లిప్సమానోఽంతరం తేషాం మృగాణా మివ లుబ్ధకః

ఓ రాజేంద్రా! వ్యాధుడు మృగం అలవాట్లు పసిగట్టి ఎరలువేసి వాటిని ఎలా చంపుతాడో అలానే ఈ దుర్గుణాలు కూడ మనిషి అవసరం బలహీనతలు గుర్తించి మానవుణ్ణి సర్వనాశనం చేస్తాయి.

యధా పాంథస్య కాంతారే సింహ వ్యాఘ్ర మృగాదయః
ఉపద్రవ కరా స్తద్వత్ క్రోధాద్య దుర్గుణా నృణామ్
—హిరణ్యగర్భ సంహిత

పులులు, సింహాలు, క్రూర మృగాలు అడవిలో ప్రయాణించే బాటసారుల్ని ఎలా బాధించి సంహరిస్తాయో అలానే కామ క్రోధాదులు మానవుణ్ణి బాధించి అంతం చేస్తుంటాయి.

18. వికత్థనః స్పృహయాలు ర్మనస్వీ
బిభ్రత్కోపం చపలోఽ రక్షణశ్చ
ఏతాన్ పాపాః షణ్ణరాః పాపధర్మాన్
ప్రకుర్వతేనోత్ర సంతః సుదుర్గే

ఓ రాజా! ఆత్మస్తుతి గావించుకొనేవాడు, దురాశగలవాడు, అభిమాని, కోపి, చపలుడు, ఆశ్రితుల్ని రక్షించలేనివాడు ఈ ఆరుగురు పాపాల నాచరిస్తూఉంటారు. ఉత్తములు ఇటువంటి దుర్మార్గులు సంచరించే మార్గంలో ప్రవేశించరు.

19. సంభోగ సంవిద్విష మేధమానో
దత్తానుతాపీ కృపణో బలీయాన్
వర్గప్రశంసీ వనితాంచ ద్వేష్టా
ఏతేపరే సప్త నృశంసరూపాః

ఓ రాజా! సుఖ భోగాపేక్షగలవాడు, ఇతరుల కపకారంచేసి పైకివచ్చేవాడు, దానంచేసి వగచేవాడు, అల్పలాభం కోసమై ఎటువంటి అవమానానైనా సహించేవాడు, బుద్ధిబలం లేనివాడు, కులీలాత్ముల్ని ప్రశంసించేవాడు, ఉత్తమురాలయిన భార్యను ద్వేషించేవాడు ఈ ఏడుగురు నృశంసులు. అంటే దుష్ట వర్తనులని సారాంశం.

20. జ్ఞానంచ సత్యంచ దమ శ్రుతంచ
హ్యామాత్సర్యం హ్రీ స్తితిక్షానసూయా
యజ్ఞశ్చ దానంచ ధృతి శ్శమశ్చ
మహావ్రతా ద్వాదశ బ్రాహ్మణస్య

ఓ రాజా! భగవత్‌జ్ఞానం, సత్యం, దమం, శాస్త్రశ్రవణం, అమాత్సర్యం, లజ్జ, సహనశీలత్వం, అనసూయ, యజ్ఞం, దానం, దృఢత్వం, అంతరింద్రియ నిగ్రహం ఈ పన్నెండు బ్రాహ్మణునకు నిత్య వ్రతాలు. బ్రహ్మవేత్త నిరంతరం వీటిని ఆచరిస్తూ ఉంటాడు.

21. య స్త్వేతేభ్యో౽ ప్రవసేత్ ద్వాదశేభ్యః
సర్వామిమాం పృథివీం స ప్రశిష్యాత్
త్రిభిర్ద్వాభ్యా మేకతో వాపి ముక్తాః
క్రమా ద్విశిష్టా మౌనభూతాభవన్తి

ఓ రాజా! ఈ పన్నెండు వ్రతాలపై నిలిచినవాడు ఈ సమస్త పృథివీతలాన్ని వశంచేసికొనగలుగుతాడు. లేక ఈ పన్నెండు గుణాలలో ఏ ఒకటి, రెండు, మూడు గుణాలను కలిగివున్నా క్రమంగా విశేష జ్ఞానాన్ని పొంది మునుత్తె మోక్ష సుఖాన్ని అనుభవింపగలరు.

22. దమస్త్యాగోఽ ప్రమాదశ్చ ఏ తేష్వమృత మాహితమ్
తాని సత్యముఖాన్యాహుః బ్రాహ్మణాయే మనీషిణః

ఓ రాజా! దమం, త్యాగం, అప్రమాదం ఈ మూడు గుణాలు అమృతప్రాయ మైనవి. బుద్ధిమంతులైన బ్రాహ్మణులు సత్యస్వరూప పరమాత్మ ప్రాప్తికి ఈ మూడు గుణాలు సాధనాలని పలుకుతున్నారు.

23. దమోష్టాదశ దోషస్స్యాత్ ప్రాతికూల్యం కృతే భవేత్
అనృతం పైశునం తృష్ణా ప్రాతికూల్యం తమోరతిః

24. లోకద్వేషోఽభిమానశ్చ వివాదః ప్రాణిపీడనం
పరివాదోఽతి వాదశ్చ పరితాపోఽ క్షమాధృతిః

25. అసిద్ధిః పాపకృత్యంచ హింసాచేతి ప్రకల్పితాః
ఏతైర్దోషైర్విముక్తో యస్సదమస్సద్భి రుచ్యతే

దమం అనే దానికి పదునెనిమిది దోషాలున్నాయి. అవి అసత్య భాషణం, పర నింద, విషయాభిలాష, అందరకు ప్రతికూలుడుగా నుండటం, అజ్ఞానం, అసంతుష్టి, లోకద్వేషం, నమ్రత లేకపోవటం, కలహస్వభావం, ప్రాణిపీడనం, నిరంతర దూషణం, నిరర్థక సంభాషణం, పశ్చాతాపం, సుఖ దుఃఖాలను సహింపలేకపోవటం, ఇంద్రియ నిగ్రహం లేకపోవటం, ధర్మజ్ఞాన వైరాగ్యాలు లేకపోవటం, పాపప్రియత్వం, అకారణ ప్రాణిహింస ఈ పదునెనిమిది దోషాలను పరిత్యజించినట్లయితే అది దమమని చెప్ప బడుతున్నది. ఆ గుణం అమృతతుల్యమయినది.

26. మదోఽష్టాదశ దోషస్స్యాత్త్యాగో భవతి షడ్విధః
విపర్యయాః స్మృతా ఏతే మదదోషా ఉదాహృతాః

ఈ పైన చెప్పబడిన పదునెనిమిది దోషాలకు విరోధ భూతములైన అంశాలే మదమును పోగొడతాయని తాత్పర్యం ఆ గుణాలు సత్యం, పరనింద చేయక పోవటం, అతృష్ణ, అప్రాతికూల్యం, జ్ఞానం, సంతుష్టి, లోకాద్వేషం, అనభిమానం, అవివాదం, అప్రాణిహింస, అపరివాదం, అనతివాదం, అపరితాపం, క్షమ, ధృతి, సిద్ధి, అపాపకృత్యం, అహింసను.

27. శ్రేయాన్ తు షడ్విధస్త్యాగ స్తృతీయో దుష్కరో భవేత్
తేన దుఃఖం తరంత్యేవ భిన్నం తస్మిన్ జితం కృతే

త్యాగం ప్రధానంగా ఆఱు విధాలుగా ఉంటుంది. ఆ ఆఱింటిలో మూడవదియైన త్యాగం ఆచరించటం చాల కష్టం. ఒకవేళ దానిని ఆచరించగలిగితే మిగిలినవన్నీ అనాయాసంగా ఆచరించవచ్చును.

28. శ్రేయాన్ తు షడ్విధస్త్యాగ శ్శ్రియం ప్రాప్యనహృష్యతి
ఇష్టాపూర్తే ద్వితీయం స్యాన్నిత్యం వైరాగ్య యోగతః

29. కామత్యాగశ్చ రాజేంద్ర స తృతీయ ఇతి స్మృతః
అప్యవాచ్యం వదంత్యేనం స తృతీయో గుణో మతః

30. త్యక్తైర్ద్రవ్యైర్యద్భవతి నోపయుక్తైశ్చ కామతః
నచకర్మ స్వ ద్దేషు దుఃఖం తేన చ సగ్లపేత్

31. సర్వైరేవ గుణైర్యుక్తో ద్రవ్యవానపి యో భవేత్
అప్రియేచ సముత్పన్నే వ్యథాం జాతు నగచ్ఛతి

త్యాగం ఆఱు విధాలని చెప్పబడింది గదా అవి—

1. సంపద ఉన్నదిగదా అని అతిశయంతో ఉండకపోవటం,
2. ఫలాలను కోరకుండగ వైరాగ్య భావంతో సత్కర్మల నాచరించటం.
3. కామత్యాగం. అదే ఇంద్రియాలను జయించటం. ఇది చెప్పటానికి కూడ చాల అశక్యమైనది.
4. ధనత్యాగం.
5. చేసిన కార్యాలు ఫలించకపోతే చింతించకపోవటం.
6. తనకు అప్రియం కలిగినా ఎప్పటికీ దుఃఖం పొందకపోవటం అనే ఈ ఆఱు గుణాలు ఉండటం త్యాగం అంటారు. వీటన్నిటిలో కామ త్యాగం అత్యంత ప్రధానమైన గుణంగా భావించాలి,

32. ఇష్టాన్ పుత్రాంశ్చ దారాంశ్చ నయాచేత కదాచన
అర్హతే యాచమానాయ ప్రదేయం తచ్ఛమావహమ్

మానవుడు ఎవడైనా యాచించేటప్పుడు ఇతరుల పుత్ర కళత్రాదుల్ని, ఇష్ట కర్మల్ని యాచించకూడదు. ఒకవేళ ఎవరేని మహాత్ముడు ఈతనిని పరీక్షించటం కోసం ఆ విధంగా కోరితే వానిని ఆ యాచించిన వానికి ఇయ్యవచ్చును

33. ఏవం దోషా దమస్యోక్తా స్తాన్ దోషాన్ పరివర్జయేత్
దోషత్యాగేఽ ప్రమాదస్స్యా త్సచాప్యష్ట గుణో మతః

ఈ విధంగా ఇంతకుముందు చెప్పిన దమం యొక్క దోషాలు విడిచివేయాలి. ఆవిధంగా ఆ దోషాలను విడిస్తే ప్రమాదత్వం పోతుంది. అప్రమాదిత్వమనేది ఎనిమిది గుణాలు కలది.

34. సత్యం ధ్యానం సమాధానం చోద్యం వైరాగ్యమేవచ
అస్తేయం బ్రహ్మచర్యంచ తథా సంగ్రహ ఏవచ

అప్రమాదిత్వానికి గల ఎనిమిది గుణాలు—సత్యం, ధ్యానం, సమాధి, యధార్థ స్థితినిగూర్చిన తర్కం, వైరాగ్యం, దొంగతనం లేకపోవటం, బ్రహ్మచర్యం, పుత్ర మిత్ర కళత్రాదులకై ఆసక్తి లేకుండటం అనేవి.

35. సత్యాత్మా భవ రాజేంద్ర! సత్యే లోకాః ప్రతిష్ఠితాః
తాంస్తు సత్యముఖానాహు స్సత్యే హ్యమృతమాహితమ్

ఓ రాజేంద్రా! నీవు సత్యస్వరూపుడవుగా ఉండు. లోకాలన్ని సత్యంలోనే ప్రతిష్ఠింపబడి ఉన్నాయి. లోకాలన్ని సత్యంవల్లనే ఏర్పడుతున్నాయి మోక్షంకూడ సత్యంలోనే ఉన్నదిగదా!

36. నివృత్తేనైవ దోషేణ తపోవ్రత మిహాచరేత్
ఏతద్ధాత్రా కృతం వృత్తం సత్యమేవ సతాం పరమ్

దోషాలను పరిహరించుకొంటూ తపస్సును ఆచరిస్తూ ఉండాలి. సజ్జనులకు సత్యమే గొప్ప తపస్సుగా పరమేశ్వరుడు నిర్ణయించాడు. సత్యవాక్పరిపాలన విశిష్ఠత యిది.

37. క్రోధాదిభి ర్ద్వాదశభి ర్విముక్తం యత్ గుణై రేతైః సమన్వితం
ఏతత్సమృద్ధ మప్యృద్ధం తపో భవతి కేవలమ్

క్రోధాది దోషరహితమైనటువంటి, సత్య జ్ఞానాదిగుణ సహితమైనటువంటి తపస్సు బుద్ధమని, సమృద్ధమని, కేవలమని చెప్పబడుతున్నది.

38. యన్మాం పృచ్ఛసి రాజేంద్ర! సంక్షేపాత్ప్రబ్రవీమి తే
ఏతత్పాపహరం శుద్ధం జన్మమృత్యుజరాపహమ్

ఓ ధృతరాష్ట్రా! నీవు అడిగినదానిని సంక్షిప్తంగా చెప్తున్నాను. నేను చెప్పబోయే విషయం సర్వపాపహరం, సకలశుద్ధం, జనన మరణ వృద్ధాప్యాలను పోగొట్టేది. దీనిని జాగరూకతతో విను.

39. ఇంద్రియేభ్యశ్చ పంచభ్యో మనసశ్చైవ భారత!
అతీతానాగతేభ్యశ్చ ముక్తశ్చేత్స సుఖీ భవేత్

ఓ రాజా! విషయాలలో ప్రవర్తించే ఇంద్రియాలను, మనస్సును జయించి జరిగిపోయినట్టి, జరుగబోవునట్టి విషయాలను వదిలిపెట్టినవాడు నిరంతరం సుఖంగా ఉండగలుగుతాడు.

ధృతరాష్ట్ర ఉవాచ—

40. ఆఖ్యాన పంచమై ర్వేదైః భూయిష్ఠం కథ్యతే జనః
తథాచాన్యే చతుర్వేదా స్త్రివేదాశ్చ తథాపరే

41. ద్వివేదాశ్చైకవేదాశ్చా ప్యనృచశ్చ తథాపరే
ఏతేషు మేఽధికం బ్రూహి యమహం వేద బ్రాహ్మణమ్

ధృతరాష్ట్రుడు సనత్సుజాత మహర్షిని ఈవిధంగా ప్రశ్నించాడు—ఓ మహాత్మా! లోకంలో పలుతెఱంగులైన బ్రాహ్మణులున్నారు. కొందరు ఇతిహాస పురాణాలు నాలుగు వేదాలు మొత్తం ఐదింటిని పఠించినవారు, కొందరు నాలుగు వేదాలను ఎఱిగినవారు, మరికొందరు మూడు వేదాలను చదివినవారు, ఇంకా కొందరు రెండు వేదాలను వల్లించినవారు, మరికొందరు ఒక వేదాన్ని అభ్యసించినవారు, కొందరసలు వేదమునే ఎఱుగనివారు. వీరిలో అధికులెవ్వరు? వీరిలో బ్రహ్మజ్ఞాని ఎవరు? నాకు తెలియజేయి.

సనత్సుజాత ఉవాచ—

42. ఏకస్య వేదస్యాజ్ఞానాత్ వేదా స్తే బహవోఽభవన్
సత్యస్యైకస్య రాజేంద్ర! సత్యే కశ్చి దవస్థితః

ఓ రాజేంద్రా! వేదమనేది ఒక్కటే. వేదమంటే సత్యపరబ్రహ్మం. వేద పురుషుడైన ఆ పరమాత్మను తెలిసికొనలేకపోవటంవల్ల వేదాలు అనేకములయినాయి. ఈ సత్యాన్ని గ్రహించినవాడే బ్రహ్మజ్ఞాని కాగలడు. వేదశబ్దం విద్ ధాతువునుంచి ఏర్పడింది. దీనికి భగవంతుని గూర్చి విచారించటం, ఉనికినిగూర్చిసాధన, తెలిసికొనటం, పొందటం అని నాలుగు అర్థాలున్నాయి.

43. ఏవం వేదమవిజ్ఞాయ ప్రాజ్ఞోఽహమితి మన్యతే
దాన మధ్యయనం యజ్ఞో లోభాదేత త్ప్రవర్తతే

ఈవిధంగా వేదం పరబ్రహ్మన్ని ప్రతిపాదిస్తున్న విషయాన్ని తెలిసికొనలేనివాడు కూడ తాను ప్రాజ్ఞుడనని తలుస్తూ ధనాభిలాషచేత యజ్ఞయాగాది కర్మలుచేస్తూ లోక వ్యవహారంలో నిమగ్నమై ఉంటున్నాడు.

44. సత్యాత్ప్రచ్యవమానానాం సంకల్పా వితథాభవన్
తతః కర్మ ప్రతాయేత సత్యస్యానవధారణాత్

సత్యస్వరూపమైన పరబ్రహ్మను తెలిసికొనలేని వారి సంకల్పాలు విరర్థక ములు. అందువల్ల వారు కర్మబంధాలలో చిక్కుకొనిపోతున్నారు. పరమాత్మ స్వరూపం తెలిసికోనందువల్ల సంసారం ఏర్పడుతున్నది పరమాత్మ తత్వాన్ని గ్రహించనంత వరకు నీటిలోపలకు వెళ్ళినవారిని మొసళ్ళు లోపలకులాగినట్లుగా వారిని సంసారంలోని రాగద్వేషాలు క్రమ్ముకొని వదిలిపెట్టవని శంకరాచార్యుల భాష్యం.

45. విద్యా ద్బహు పఠంతం తు బహువాగితి బ్రాహ్మణం
య ఏవ సత్యా న్నాపైతి స జ్ఞేయో బ్రాహ్మణ స్త్వయా

నిస్సారంగా పురాణేతిహాసాలు వేదాలు మొదలైన వాటిని సమగ్రంగా చదివిన వానిని బహువాక్కు అని అంటారేకాని బ్రాహ్మణుడని అనరు సత్యస్వరూపుడైన బ్రహ్మను ఎఱిగిన వానినే బ్రాహ్మణుడని అన్నారు.

46. ఛందాంసి నామ ద్విపదాం వరిష్ఠ
స్వచ్ఛందయోగేన భవంతి తత్ర
ఛందోవిద స్తేనచ తా నధీత్య
గతాహి వేదస్య నవేద్య మార్యాః

ఓ ధృతరాష్ట్ర మహారాజా! వేదాలు పరమాత్మ గురించి కూలంకషంగా వర్ణిస్తాయి. వేదాలు పరమాత్మ తత్వాన్ని తెలియజేయటానికి ప్రమాణములు కదా. అటువంటి వేదాలను తెలిసికొన్న విద్వాంసులు వేదపురుషుడైన పరమాత్మను తెలిసికొంటారు గాని ఈ ప్రపంచాన్ని వారు పొందరు.

47. న వేదానాం వేదితా కశ్చి దస్తి
వేద్యేన వేదం నవిదు ర్నవేద్యం
యో వేద వేదం సన వేదవేద్యం
యో వేదవేద్యం న స వేద సత్యమ్

నిజానికి వేదాలలో ఏ ఒక్కటికూడ వాచామగోచరుడైన పరమాత్మను సమగ్రంగా తెలియజేయగలదికాదు. అందువల్లనే వేదాలను జడ స్వరూపాలని అన్నారు. జడ స్వరూపాలతో జ్ఞాన స్వరూపుణ్ణి తెలిసికొనలేరుకదా. పరమాత్మ విశ్వరూపుడు కాబట్టి అటువంటివారు విశ్వాన్నికూడ తెలిసికోలేరు

48. యో వేదవేదాన్ సచ వేద వేద్యం
న తం విదు ర్వేదవిదో న వేదాః
తథాపి వేదేన విదంతి వేదం
యో బ్రాహ్మణా వేదవిదో భవంతి

వేదాలను గ్రహించినవాడు పరమాత్మను కూడ గ్రహింపగలుగుతాడు. ఆ పరమాత్మను వేదవేత్తలు వేదాల ద్వారా తప్ప స్వయంగా తెలిసికొనలేరు. వేదాలు పరమాత్మణ్ణి ఎఱుగజాలనప్పటికీ ఏ బ్రాహ్మణులు వేదాలవల్ల పరమాత్మను జ్ఞానంతో తెలిసికొనగలుగుతున్నారో వారిని వేదవేత్తలని అన్నారు.

49. ధామాంశభాగస్య తథాహి వేదా
యథాహి శాఖావ మహీరుహస్య
సంవేదనే చైవ మథా మనంతి
తస్మిని నిత్యే పరమార్థనోఽర్థే

పరమాత్మ వాక్కులకు అందనివాడుగదా ఆయనను వేదములద్వారా తెలిసకొనుట ఎలా అని భావిసావేమో విదియనాటిచంద్రుని మరొక్కనికి చూపించేటప్పుడు ఆ కొమ్మమీద చూడు చంద్రకళ కనబడుతుంది అని జాడతెలిపేవిధంగా భగవంతుణ్ణి తెలిసికొనటానికి వేదవాక్యాలు ఉపయోగపడతాయి.

50. అభిజానామి బ్రాహ్మణ మాఖ్యాతారం విచక్షణం
ఏవం యో హి విజానాతి సజానాతి పరం హి తత్

పరమాత్మ తత్వాన్ని నిరంతరం వ్యాఖ్యానించేవాడే బ్రాహ్మణుడు. పైనచెప్పిన విధంగా వేదవాక్యాల ద్వారా బ్రాహ్మణుడు పరబ్రహ్మను తెలిసికొంటాడుగదా.

51. నాస్య పర్యేషణం గచ్ఛేత్ ప్రత్యర్థిషు కథంచన
అవిచిన్వ న్నిమం వేదే తతః పశ్యతి తం ప్రభుం

ఇంద్రియాది విరోధిగణాలలో పరమాత్మను ఎప్పటికి ధావించకూడదు. అంటే దేహమునే ఆత్మగా తలచరాదు. విషయవ్యాసంగం చేయకుండగా ఉత్తముడు తత్వమసి మొదలైన వాక్యాల ద్వారా పరమాత్మను తన ఆత్మగా తెలిసికొంటున్నాడు.

52. తూష్ణీంభూత ఉపాసీత నచేష్టే న్మనసాపిచ
ఉపావర్తస్వ తద్బ్రహ్మ హ్యంతరాత్మని వై శ్రుతమ్

బాహ్యేంద్రియ, అంతరింద్రియ వ్యాపారాలను విడిచిపెట్టి మనస్సును చలింపనీయకుండగా ఏకాగ్రతతో ఆ పరబ్రహ్మము మీదికి మరల్చు. ఆ బ్రహ్మము నీ హృదయాకాశంలో ఉన్నదనే శ్రుతివచనం యథార్థమని తెలిసికొంటావు.

53. తూష్ణీంభూత ఉపాసీత నచేష్టే న్మనసాపిచ
అభ్యావర్తేత బ్రహ్మాస్మై బ్రహ్మాంతర మాప్నుయాత్

బాహ్యాభ్యంతర విషయాలను పరిత్యజించి ఊరకనే ఉపాసన చేయాలి. మనస్సులో కూడ ఎటువంటి కోరిక కోరకూడదు. అటువంటివానికి బ్రహ్మము అభిముఖ మౌతుంది. తరువాత ఆతడు బ్రహ్మమును పొందగలుగుతాడు.

54. మౌనా న్మని స్స భవతి నారణ్యే వసనా న్మునిః
అక్షరం యంచ యో వేద స మునిశ్రేష్ఠ ఉచ్యతే

అటువంటి బ్రాహ్మణుడు మౌనంతో ఉంటున్న కారణంచేత ఆతడు మ నియని పిలువబడుతున్నాడు. అంతేకాని కేవలం అరణ్యాలలో నివసించటంవల్ల ఆతడు ముని కాడు. అక్షరుడైన ఆ పరమాత్మను ఎవడు తెలిసికొనగలుగుతాడో అతడే ముని శ్రేష్ఠుడుగా చెప్పబడుతున్నాడు.

55. సర్వార్థానాం వ్యాకరణా ద్వైయాకరణ ఉచ్యతే
తన్మూలతో వ్యాకరణం వ్యాకరోతీతి తత్తథా

సకల పదార్థాలయొక్క సాధ్వసాధు రూపాలను విమర్శించేవాడు వైయాకరణుడని అనబడుతున్నాడు. అదేవిధంగా ఆ అక్షర పరబ్రహ్మం నుంచి ఉద్భవించిన సమస్త నామరూప ప్రపంచాన్ని సవిమర్శగాచూచి వ్యాఖ్యానించే జ్ఞానికూడ వైయాకరణుడనబడుతున్నాడు.

56. ప్రత్యక్షదర్శీ లోకానాం సర్వదర్శీ భవే న్నరః
సత్యే వై బ్రాహ్మణ స్తిష్ఠన్ తద్విద్వాన్ సర్వవి ద్భవేత్

సకల లోకాలను ప్రత్యక్షంగా చూచే మానవుణ్ణి సర్వజ్ఞుడని అన్నారు. సత్యస్వరూపుడైన పరమాత్మయందే మనస్సుగలిగి ఆ బ్రహ్మ తత్త్వాన్ని దర్శించిన బ్రాహ్మణుడు కూడ సర్వజ్ఞుడుగానే భావింపబడుతున్నాడు.

57. జ్ఞానాదిషు స్థితోప్యేవం క్షత్రియః బ్రహ్మ పశ్యతి
వేదానాం చానుపూర్వేణ హ్యేతద్విద్వన్ బ్రవీమి తే

ఓ విద్వాంసుడా! ఇంతకుముందు చెప్పిన జ్ఞానం, సత్యం మొదలైన పన్నెండు గుణాలు గలవాడు పరమాత్మను దర్శింపగలుగుతున్నాడు. వేదాల ననుసరించేవాడుకూడ భగవంతుని తెలిసికొనగలుగుతున్నాడు. ఈ విషయాన్ని నేను నీకు నిశ్చయంగా చెప్ప గలను అని సనత్సుజాత మహర్షి ధృతరాష్ట్రునితో వచించాడు.

—o—

# "బ్రహ్మచర్యం పాటించు"

ధృతరాష్ట్ర ఉవాచ—

1. సనత్సుజాత! యదిమాం పరార్థాం
బ్రాహ్మీం వాచం ప్రవదసి విశ్వరూపాం
పరాంహి కార్యేషు సుదుర్లభాం కథాం
ప్రబ్రూహి మే వాచమేవం కుమార!

ధృతరాష్ట్ర మహారాజు ఇలా పలికాడు— ఓ సనత్సుజాత కుమారా! అత్యంత శ్రేష్ఠమైన మోక్ష సాధనమైన బ్రహ్మతత్వం గురించి ఉపదేశించావు. ఇప్పుడు నీవే పరమ పురుషార్థ సాధనమైన దానిని మరొక్కటి నాకు ఉపదేశించు!

సనత్సుజాత ఉవాచ—

2. నైతద్బ్రహ్మ త్వరమాణేన లభ్యం
యన్మాం పృచ్ఛస్యభిహంగేణ రాజన్
బుద్ధౌ ప్రలీనే మనసి ప్రచింత్యా
విద్యాహి సా బ్రహ్మచర్యేణ లభ్యా

సనత్సుజాత మహర్షి ఇలా సమాధానం చెప్పాడు— ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీవు నన్ను అడిగిన ఈ బ్రహ్మము త్వరపడే పురుషునిచేత పొందబడేదికాదు. సంకల్ప వికల్పాత్మకమైన మనస్సును విషయ వాసనల నుంచి వెనుకకు మరలించి పరమాత్మపైకి కేంద్రీకరించాలి. పరబ్రహ్మమును పొందటానికి బ్రహ్మచర్యం అత్యావశ్యకం.

3. అవ్యాకృం విద్యాం వదసిహి సత్యరూపాం
యా ప్రాప్యతే బ్రహ్మచర్యేణ సద్భిః
యాం ప్రాప్యైవం మర్త్యభావం త్యజంతి
యా వై విద్యా గురువృద్ధేషు నిత్యా

ఓ రాజా! నీవు సత్యస్వరూపమైన, సకల విద్యలకు మూలకారణమైన విద్యను చెప్పవలసినదని కోరినావు. పరమోత్కృష్టమైన ఆ విద్యను సత్పురుషులు బ్రహ్మచర్యంవల్ల పొందుతున్నారు. ఆ విద్యను పొందినవారు మర్త్యభావాన్ని వదిలిపెట్టి దివ్య భావనలో నిమగ్నమై ఉంటారు. ఆ విద్య గురువులచేత శాస్త్రోక్తంగా ఉపదేశింపబడిన శిష్యులయందే నిలుస్తుంది. అంతేగాని ఆవిద్య నీవడిగినంత తేలికగా లభ్యమయ్యేదికాదు.

ధృతరాష్ట్ర ఉవాచ—

4. బ్రహ్మచర్యేణ యా విద్యా
శక్యావేదితు మంజసా
తత్కథం బ్రహ్మచర్యం స్యా
ద్వేదే విద్వన్ బ్రవీహి మే

అప్పుడు ధృతరాష్ట్రుడు మహర్షిని ఇలా ప్రశ్నించాడు— విద్య అనేది బ్రహ్మచర్యంచేతనే శీఘ్రంగా పొందవచ్చుననేది ప్రసిద్ధమైన విషయమే. మరి వేదాధ్యయన విషయంలో బ్రహ్మచర్యం ఏ విధంగా పాటించాలి? నాకు విశదీకరించు

సనత్సుజాత ఉవాచ—

5. ఆచార్యయోని మిహయే ప్రవిశ్య
భూత్వా గర్భం బ్రహ్మచర్యం చరంతి
ఇహైవ తే శాస్త్రకారా భవంతి
విహాయ దేహం పరమం యాంతి సత్యం

సనత్సుజాత మహర్షి ఇలా పలికాడు— ధృతరాష్ట్రా! బ్రహ్మచర్య విధానం విను. శిష్యులు ఆచార్యుని సన్నిధికివెళ్ళి, వినయ విధేయతలతో ఆచార్యుని మెప్పించి

బ్రహ్మచర్యం పాటిస్తూ వేదాధ్యయనం చేయాలి. అటువంటి ఉత్తములే ఈ లోకంలో శాస్త్రకర్తలు కాగలుగుతున్నారు. అటువంటివారే దేహత్యాగానంతరం సత్యస్వరూపుడైన పరమాత్మను పొందుతున్నారు.

6. అస్మిన్ లోకే విజయంతీహ కామాన్
బ్రాహ్మీం స్థితి మనుతితీక్షమాణాః
త ఆత్మానం నిర్హరంతీహ దేహాన్
ముంజాదిషీ కామివ ధీరభావాత్

ఓ రాజా! ఈ జగత్తులో బ్రాహ్మీస్థితి పొందటానికి నానాప్రకారాలైన ద్వంద్వాలను సహించాలి. అటువంటివాడు కామాలను సంపూర్ణంగా జయించాలి. ఎంతో ఓర్పును వహించిఉండాలి. వారు ధైర్యంతో ముంజగడ్డినుంచి కాడను విడదీసినట్లుగా ఈ దేహంలోనుంచి ఆత్మను విడదీయటానికి సిద్ధపడి ఉండాలి. అంటే బ్రహ్మప్రాప్తి పొందటానికి తేలికగా దేహత్యాగం చేయగలిగిన ధైర్యంతో ఉండాలి.

"అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మాసదా
జనానాం హృదయే స నివిష్టః
తంస్వాచ్ఛరీరాత్ ప్రవహేన్ ముంజాదివేషీకాం
ధైర్యేణతం విద్యాచ్ఛుకమమృతమ్"

—శంకరాచార్య

అంగుష్ఠ మాత్రుడగు పురుషుడు సర్వదా జీవుని హృదయంలో అంతరాత్మ రూపంలో ప్రకాశిస్తుంటాడు. శరీరంనుంచి ముంజగడ్డనుండి కాడను వేరుచేసినట్లు ఆ శుద్ధ అమృతత్వాన్ని ధైర్యంతో జ్ఞానంతో పట్టుకొని వేరుచేసి ఆత్మావలోకనం చేయాలి. ఇది సాధకుడు చేస్తాడు.

7. శరీరమేతౌ కురుతః పితా మాతా చ భారత!
ఆచార్య తస్తుయజ్జన్మ తత్సత్యం తథామృతమ్

ఓ రాజా! తల్లిదండ్రులు ఈ శరీరానికి జన్మనిస్తున్నారు కానీ అసలుజన్మ ఆచార్యుడి ఉపదేశంతోనే ప్రారంభమవుతుంది. ఆచార్యుడు ఆత్మతత్వాన్ని బోధించి క్రొత్త జన్మనిస్తున్నాడు. ఆ జన్మచేత సత్యస్వరూపుడైన పరమాత్మను తెలిసికొనవచ్చు. కాబట్టి ఆ జన్మ పరమ పవిత్రం, అమృతమయం అని చెప్పబడింది.

"సహి విద్యా త స్తం జనయతి తచ్ఛ్రేష్ఠం
జన్మశరీరమేవ మాతాపితరౌ జనయతః"

—ఆప స్తంబమహర్షి

ఆచార్యదేవా! అవిద్యా పారం చూపుమాపే గురుదేవుడీవు. నీవే మాకు తండ్రివి. తల్లిదండ్రులు పాంచభౌతిక శరీరం మాత్రమిస్తారు.

8. స అవృణో త్యమృతం సంప్రయచ్ఛన్
తస్మై న ద్రుహ్యే త్కృతమస్య జానన్
గురుం శిష్యో నిత్యమభివాద యీత
స్వాధ్యాయ మిచ్ఛేచ్చ సదాఽప్రమత్తః

ఆచార్యుడు మోక్షవిద్యఅనే అమృతత్వంతో శిష్యుణ్ణి పునీతం చేస్తున్నాడు. కాబట్టి శిష్యుడు తనకు గురువుచేసిన మహోపకారాన్ని మరిచిపోకుండగా నిరంతరం ఆ గౌరవాన్ని కృతజ్ఞతను చూపిస్తూ ఉండాలి. అంతేకాని గురువుపట్ల యే కొంచం కూడా ద్రోహచింతన ఉండకూడదు.

9. శిష్యవృత్తి క్రమేణైవ విద్యామాప్నోతి యచ్ఛుచిః
బ్రహ్మచర్యవ్రత స్యాస్య ప్రథమః పాద ఉచ్యతే

శిష్యుడు పరిశుద్ధుడైయుండి ఆచార్యునియందు ఉండవలసిన పద్ధతిలో ఉంటూ అధ్యయనం చేయటం బ్రహ్మచర్యంలో మొదటిపాదంగా భావింపబడుతున్నది.

10. యథా నిత్యం గురౌ వృత్తిః
గురుపత్న్యాం తథా చరేత్
పుత్రేషు చ తథా కుర్వన్
ద్వితీయః పాద ఉచ్యతే

నిరంతరం తనకు బ్రహ్మవిద్యను ప్రసాదించే గురువుపట్ల ఎటువంటి ఉత్తమ ప్రవర్తనం ఉంటుందో అటువంటి గౌరవ భావమే గురుపత్నిమీద, గురు పుత్రులమీద కూడ చూపటం బ్రహ్మచర్యంలో రెండవపాదంగా భావింపబడుతున్నది.

11. ఆచార్యేణాత్మకృతం విజానన్
జ్ఞాత్వా చార్థం భావితోస్మి త్యనేన
యన్మన్యతే తంప్రతి హృష్టబుద్ధి
స్స తృతీయో బ్రహ్మచర్యస్య పాదః

ఆచార్యుడు తనకుపదేశించిన విద్యను బాగా గ్రహించి, దాని అర్థాన్ని సర్వదా స్మరించి, "ఇటువంటి ఉత్తముడు నాకాచార్యుడయ్యెనుగదా! ఈయనవల్ల కదా నేను బ్రహ్మజ్ఞానాన్ని పొందుతున్నాను" అని సంతోషంతో భావనచేస్తూ ఉండటం బ్రహ్మచర్యంలో మూడవ పాదంగా చెప్తున్నారు.

12. ఆచార్యాయ ప్రియం కుర్యాత్ ప్రాణైరపి ధనైరపి
కర్మణా మనసా వాచా చతుర్థః పాద ఉచ్యతే

ఓ రాజా! ప్రాణాలుఒడ్డి ధనం వెచ్చించి మనో వాక్కాయ కర్మల ద్వారా ఆచార్యుణ్ణి సేవించాలి. ఆచార్యునికి ఇష్టమైన కార్యాలు, శుశ్రూషలు చేస్తుండాలి. ఇది బ్రహ్మచర్యంలో నాల్గవ పాదంగా భావింపబడుతున్నది.

13. కాలేన పాదం లభతే తథాఽయం
తథాచ పాదం గురుయోగతశ్చ
ఉత్సాహ యోగేనచ పాదమృచ్ఛే
చ్ఛాస్త్రేణ పాదం చ తతోఽభి యాతి

విద్యా సముపార్జనకు నాలుగు పాదాలున్నాయి. తగిన కాలం సమకూడటం, గురుసన్నిధి ప్రాప్తించటం, బుద్ధిబలంతో ఉత్సాహంతో విద్యార్జన చేయటం, శాస్త్ర జ్ఞానం కలగటం అనే ఈ నాలుగు విధాలుగా విద్యను పొందితే పరమ పురుషార్థం లభిస్తుంది.

14. జ్ఞానాదయో ద్వాదశ యస్యరూప
మన్యాని చాంగాని తథా బలంచ
ఆచార్యయోగే ఫలతీతి చాహుః
బ్రహ్మార్థ యోగేనచ బ్రహ్మచర్యమ్

పురుషుడికి జ్ఞానాదులైన పన్నెండూ గుణాల రూపంగా భాసిస్తున్నాయి. అలాగే ఆరువిధాలైన త్యాగాలు, నిమిది విధాలైన అప్రమాదిత్వ గుణాలు అంగాలుగా భాసిస్తున్నాయి. శిష్యుడికి ఇవన్నీ సద్గురువు సన్నిధిలోనే ఫలిస్తున్నాయి. వీటిద్వారా శిష్యుడు నిరంతరం బ్రహ్మార్థయోగంలో ఉండటంవల్ల దానిని బ్రహ్మచర్యమని అన్నారు.

15. ఏతేన బ్రహ్మచర్యేణ దేవా దేవత్వ మాప్నువన్
ఋషయశ్చ మహాభాగా బ్రహ్మచర్యేణ చాభవన్

మహత్తరమైన, అద్భుతమైన ఈ బ్రహ్మచర్యం చేతనే దేవతలు దైవత్వాన్ని సాధించారు మహానుభావులు ఈ బ్రహ్మచర్యంవల్లనే ఋషీశ్వరులు కాగలిగారు.

16. ఏతేన సగంధర్వా రూపాణ్యప్సరసోఽజయన్
ఏతేన బ్రహ్మచర్యేణ సూర్య అహ్నాయ జాయతే

విశిష్టమైన ఈ బ్రహ్మచర్యం చేతనే గంధర్వులు, అప్సరసలు మనోహరమైన సౌందర్యాన్ని పొందారు. ఈ బ్రహ్మచర్య ప్రభావం వల్లనే సూర్యుడు లోకాలను ప్రకాశింపజేసే సామర్థ్యంతో వెలుగొందుతున్నాడు.

17. ఆకాంక్ష్యార్థస్య సంయోగా ద్రస భేదార్థినా మివ
ఏవం హ్యేత త్సమాజ్ఞాయ తాదృగ్భావం గతా ఇమే

చింతామణి, కామధేనువు మొదలైనవి కోరిన వారి కోరికల ననుసరించి ఆయా వస్తువులను ప్రసాదిస్తాయి. ఆదేవిధంగా బ్రహ్మచర్యంవల్లనే దైవత్వం, ఋషిత్వం పొందటం సాధ్యమయింది.

18. అంతవంతః క్షత్రియః తే జయంతి
లోకాన్ జనాః కర్మణా నిర్మితేన
జ్ఞానేన విద్వాన్ తేజ అభ్యేతి నిత్యం
నవిద్యతే హ్యన్యథా తస్య పంథాః

ఓ మహారాజా! కర్మలను ఆచరించేవారు కొంతకాలం అనుభవించి నశించే ఫలాలుగల ఈ లోకాలను జయింపగలుగుతున్నారే కాని పరబ్రహ్మాన్ని సాధించలేరు. కాని విద్వాంసులు విశిష్టమైన జ్ఞానంచేత శాశ్వతమైన బ్రహ్మపదాన్ని పొందగలుగుతున్నారు. ఆ బ్రహ్మతేజం పొందటానికి జ్ఞానంతప్ప మరొక మార్గంలేదు.

ధృతరాష్ట్ర ఉవాచ—

19. అభాతి శుక్ల మివ లోహిత మివాధో
కృష్ణ మర్జునం వా కాద్రవం వా
యద్బ్రాహ్మణః పశ్యతి యత్ర విద్వాన్
కథం రూపం తదమృత మక్షరం పదమ్

ఈ విషయాలు విని ధృతరాష్ట్ర మహారాజు మరల సనత్సుజాత మహర్షిని ఇలా ప్రశ్నించాడు — ఓ మహాత్మా! బ్రహ్మజ్ఞాని పొందే ఆత్మసాక్షాత్కారం ఏవిధంగా ఉంటుంది. అమృతస్వరూపమైన, అక్షరరూపమైన ఆ పరబ్రహ్మం యొక్క ప్రకాశం తెల్లగా ఉంటుందా? ఎఱ్ఱగా ఉంటుందా? నల్లగా ఉంటుందా? లేక పచ్చగా ఉంటుందా? నాకు తెలిసికొనాలని ఉంది. విశదీకరించు.

సనత్సుజాత ఉవాచ—

20. నాభాతి శుక్ల మివ లోహిత మివాధో
కృష్ణ మర్జునం వా కాద్రవం వా
న పృథివ్యాం తిష్ఠతి నాంతరిక్షే
నైతత్సముద్రే సలిలం బిభర్తి

సనత్సుజాత మహర్షి ధృతరాష్ట్రునితో ఇలా పలికాడు— ఓ రాజా! ఆ బ్రహ్మస్వరూపం నీవు అడిగినవిధంగా తెల్లగా, ఎఱ్ఱగా, నల్లగా, పచ్చగా ప్రకాశించేదికాదు. అటువంటివస్తువు భూమిపైలేదు. అంతరిక్షంలోలేదు, సముద్రంలోలేదు. అది ప్రపంచాతీతం, రూపవర్ణరహితం.

21. న తదృక్షు తన్నయజుఃషు నాప్యథర్వసు
నదృశ్యతేవై విమలేషు సామసు
రథంతరే బార్హద్రథేవాపి రాజన్।
మహావ్రతేనైవ దృశ్యే ధ్రువం తత్

ఓ రాజా! ఆ పరబ్రహ్మం ఋగ్యజుస్సామాధర్వణ వేదమంత్రాలలో కనిపించదు. రథంతర, బార్హద్రథాది సామములందుగాని, మహావ్రతాలలోగాని కనిపించదు. ఇది నిశ్చయం, సందేహంలేదు.

22. అపారణీయం తమసః పరస్తా
తదంతతోఽభ్యేతి వినాశకాలే
అణీయరూపం చ తథాప్యణీయ సాం
మహత్స్వరూపం త్వపి పర్వతేభ్యః

ఆ పరబ్రహ్మం అజ్ఞానానికి వెలుపలఉంది. అంటే సంసారానికి అవతలఉంది. జ్ఞానియైనవాడు దేహ త్యాగానంతరం దానిని పొందుతున్నాడు. ఆ పరబ్రహ్మం స్వల్పమైన వస్తువులకంటె స్వల్పమయింది. పర్వతాలకంటె ఘనమయింది.

23. తదేతదహ్నా సంస్థితం భాతి సర్వం
తదాత్మ విత్పశ్యతి జ్ఞానయోగాత్
తస్మిన్ జగత్సర్వ మిదం ప్రతిష్ఠితం
యేతద్విదు రమృతాస్తే భవంతి

ఆ పరబ్రహ్మం నిత్యప్రకాశంతో వెలుగొందుతూ ఉంటుంది. దానిని ఆత్మవేత్తయైనవాడు తన జ్ఞానంతో మాత్రమే దర్శిస్తున్నాడు. ఆ పరబ్రహ్మంలోనే ఈ సకల జగత్తు ప్రతిష్ఠితమైఉంది. ఈ విషయం తెలిసికొన్నవారు అమృతులు, ముక్తులు కాగలరు.

—0—

# "సద్గుణాల నలవరచుకో"

సనత్సుజాత ఉవాచ—

1. శోకః క్రోధశ్చ లోభశ్చ కామో మానః పరాసుతా
ఈర్ష్యా మోహో విధిత్సాచ కృపాఽసూయా జుగుప్సతా

2. ద్వాదశైతే మహాదోషా మనుష్య ప్రాణనాశకాః
ఏకైకమేతే రాజేంద్ర! మనుష్యాన్ పర్యుపాసతే
యైరావిష్టో నరః పాపం మూఢసంజ్ఞో వ్యవస్యతి

సనత్సుజాత మహర్షి ధృతరాష్ట్రునితో ఇంకా ఇలా అన్నాడు— ఓ రాజేంద్రా! శోకం, క్రోధం, లోభం, కామం, మానం, నింద, ఈర్ష్య, మోహం, విషయాసక్తి, తనవారిపై దయ, అసూయ, జుగుప్స ఈ పన్నెండు మనుష్యుల ప్రాణాలను నశింప చేసే మహాదోషాలు. ఇవి మనుష్యులలో క్రమక్రమంగా ప్రవేశిస్తున్నాయి. ఈ ద్వాదశ దోషాలచేత ఆవేశింపబడ్డవాడు మూఢుడై పాపకార్యాసక్తుడౌతున్నాడు.

3. స్పృహయాలు రుగ్రః పరుషో వదాన్యః
క్రోధం బిభ్ర న్మనసా వై వికత్థీ
నృశంస ధర్మా షడిమే జనా వై
ప్రాప్యాప్యర్థం నోత సభా జయంతే

ఓ రాజా! ఆశగలవాడు, నిర్దయుడు, కఠినవాక్కుగలవాడు, బహుభాషి, క్రోధనుడు, ఆత్మశ్లాఘి, క్రూరధర్ములైన ఈ ఆరుగురు మనుష్యులు తాము ఎవరిచేత ఉపకారాన్ని పొందుతారో వారినికూడ ఆదరింపరు.

4. సంభోగ సంవిద్విషమోఽతిమానీ
దత్త్వా వికత్థీ కృపణో దుర్బలశ్చ
బహుప్రశంసీ వనితా ద్విట్సదైవ
సప్తైవోక్తాః పాపశీలా నృశంసాః

సంభోగాసక్తుడు విషమబుద్ధిగలవాడు, అతి గర్వితుడు, దానంచేసి చెప్పుకొనే వాడు, కృపణుడు, అజ్ఞానియైన ఆత్మస్తుతి పరాయణుడు, నిరంతరం తన భార్యను ద్వేషించేవాడు అనే ఏడుగురు పాపకర్ములని చెప్పబడుతున్నారు.

5. ధర్మశ్చ సత్యంచ తపో దమశ్చ
హ్యమాత్సర్యం హ్రీ స్తితిక్షానసూయా
ధ్యానం శ్రుతంచైవ ధృతిః క్షమాచ
మహావ్రతా ద్వాదశ బ్రాహ్మణస్య

ధర్మం, సత్యం, తపస్సు, దమం, అమాత్సర్యం, అకృత్యాల యెడల సిగ్గు, ద్వంద్వ భావాలయెడల సహనం, అనసూయ, ధ్యానం, వేదాధ్యయనం, ధైర్యం, ఓర్పు ఈ పన్నెండు గుణాలు బ్రాహ్మణుని కుండవలసిన మహావ్రతాలు.

6. యో వై తేభ్యః ప్రచ్యవే ద్ద్వాదశభ్యః
సర్వామపీమాం పృథివీం స శిష్యాత్
త్రిభి ర్ద్వాభ్యా మేకతో వార్థితో యో
నాస్య స్వమస్తీతి చ వేదితవ్యమ్

విశిష్టమైన ఈ పన్నెండు గుణాలు ధరించి వచ్చినవాడు సమస్త భూమండలాన్ని పరిపాలించటానికి సమర్థుడుగా ఉంటాడు. ఈ గుణాలలో ఒకటి, రెండు, మూడు ఉన్నప్పటికి అతనికి సంసారంలో మమకారం ఉండకుండగ విరక్తి భావంతో ప్రకాశిస్తుంటాడు.

7. దమ స్త్యాగో౽ప్రమాద ఇత్యేతే ష్వమృతం స్థితం
ఏతాని బ్రహ్మముఖ్యానాం బ్రాహ్మణానాం మనీషిణాం

ఇంద్రియ నిగ్రహం, త్యాగం, అప్రమాదం వీటిల్లో అమృతత్వం మోక్షం ఉన్నాయి. బ్రహ్మజ్ఞానులైన విద్వాంసులైన బ్రాహ్మణులకు ఈ మూడు గుణాలు ఉంటాయి.

8. సద్వా౽సద్వా పరీవాదో బ్రాహ్మణస్య నశస్యతే
నరకప్రతిష్ఠా స్తేప్యై స్యుర్య ఏవం కుర్వతే జనాః

బ్రహ్మవేత్తయైనవాడు ఒకరియందున్న నిందను గురించి ప్రస్తావించటంగాని, ఒకరిపై నిందారోపణ చేయటంగాని చేయడు ఈవిధంగా ఒకరిని నిందించేవారు నరకాన్ని పొందుతున్నారు.

9. మదో౽ష్టాదశ దోషస్స్యా త్పురా యో౽త్ర ప్రకీర్తితః
లోకద్వేష్యం ప్రాతికూల్య మభ్యసూయా మృషావచః

10. కామక్రోధౌ పారతంత్ర్యం పరీవాదో౽థ పైశునం
అర్థహా నిర్వివాదశ్చ మాత్సర్యం ప్రాణిపీడనమ్

11. ఈర్ష్యా మదో౽తివాదశ్చ స జ్ఞానశో౽భ్యసూయతా
తస్మా త్ప్రాజ్ఞో నమాద్యేత సదాహ్యేత ద్విగర్హి తమ్

ఇంతకుముందు మదము పదునెనిమిది దోషాలతో కూడియున్నట్లు తెలిసికొన్నాము.లోకద్వేష ప్రవృత్తి, ధర్మకార్యవిఘ్నం, దోషారోపణం, అసత్యభాషణం కామక్రోధాలతో ఉండటం, పారతంత్ర్యం, నింద, కొండెములు చెప్పటం, దుష్కార్యము లందు అర్థనాశం, వివాదం, మాత్సర్యం, ప్రాణిహింస ఈర్ష్య, మదం, అతిభాషణం, అవివేకం, అసూయత మొదలైనవికూడ మద సంబంధమైన దోషాలు. వీటిని వేటినీ విద్వాంసుడు పొందకూడదు, ఈ మదం ఎప్పుడూ నిందింపదగినదే.

12. సౌహృదే వై షడ్గుణా వేదితవ్యాః
ప్రియే హృష్యంత్యప్రియేచ వ్యథంతే
సదాత్మన స్సుహితం యాచతే యో
దతాత్యయాచ్యమపి దేయా ఖలు స్యాత్

స్నేహం విషయంలో ఆరు గుణాలు తెలిసికొనవలసినవి ఉన్నాయి. మిత్రునకు మంచి కలిగితే సంతసించాలి. చెడు కలిగితే బాధపడాలి, తనకిష్టమైనదానిని అడుగరానిదయినా మిత్రులడిగితే ఇవ్వాలి.

13. ఇష్టాన్ పుత్రాన్విభవాన్ స్వాంశ్చ దారా
నభ్యర్థిత శ్చార్హతి శుద్ధభావః
త్యక్తద్రవ్య స్సంవసే న్నేహ కామా
ద్భుంక్తే కర్మ స్వాశిషం బాధతేచ

తనకతిప్రియులైన పుత్రాదులను సంపదలను అడిగినా వారికి మంచి మనస్సుతో అర్పించాలి. దానంచేసి మరల వారిదగ్గర ధనాన్ని ఆశించి వారిఇంట ఉండకూడదు. మిత్రక్షేమంకోసం తనమేలుకూడ పరిత్యజించాలి. ఈ ఆరు మిత్రత్వానికి ఉండవలసిన ఉత్తమ గుణాలు.

14. ద్రవ్యవాన్ గుణవా నేవం త్యాగీ భవతి సాత్వికః
పంచభూతాని పంచభ్యో నివర్తయతి తాదృశః

ఈ విధమైన సుగుణాలు కలిగి, ద్రవ్యవంతుడై, త్యాగియైయున్నవాడు సాత్వికుడని పిలువబడుతున్నాడు. అటువంటివాడు ఇంద్రియాలను విషయాలలో ప్రవేశింపనీయక జితేంద్రియుడుగా ఉంటాడు.

15. ఏతత్ సమృద్ధ మప్యూర్ధ్వం తపో భవతి కేవలం
సత్వాత్ ప్రచ్యవమానానాం సంకల్పేన సమాహితమ్

ఈ ఇంద్రియ జయం కూడ సమృద్ధతపమని భావింపబడుతోంది. కాని జ్ఞాన ప్రధానమైన కేవల తపంలాగా ఇది ఇహ లోకంలోనే కృతకృత్యత్వాన్ని ఇవ్వలేదు

ఊర్ధ్వగతినీ కలిగించేది కేవలతపమే. అదికూడ తీవ్ర వైరాగ్యం లేకపోవటంవల్ల, సత్వచ్యుతులై జిజ్ఞాసవల్ల వారు ఉర్ధ్వగతి పొందటానికి కారణమౌతోంది.

16. యతో యజ్ఞాః ప్రవర్ధంతే సత్యస్యైవావ ధారణాత్
మనసాన్యస్య భవతి వాచాన్యస్యాథ కర్మణా

యజ్ఞాలు మానసికము, వాచికము, కాయికములని మూడు విధాలుగా ప్రవర్తిల్లుతున్నాయి. ఇవన్నీ సత్యస్వరూపుడైన ఆ పరాత్పరుని నుంచి ఉద్భవించినవే. కొందరు మానసిక యజ్ఞాలు చేస్తారు. కొందరు వాచిక యజ్ఞాలు చేస్తారు. మరికొందరు కాయిక యజ్ఞాలు చేస్తారు.

17. సంకల్ప సిద్ధం పురుష మసంకల్పోఽధితిష్ఠతి
బ్రాహ్మణస్య విశేషేణ కించాన్యదపి మే శ్రుణు

ఎటువంటి కోరికలేనివాడు సత్యస్వరూపుడైన పరమేశ్వరుణ్ణి పొందుతున్నాడు. బ్రహ్మజ్ఞానియైనవానికి అవశ్యకమైనది మరొక్కటికూడ విశదీకరిస్తున్నాను విను.

18. అధ్యాపయే న్మహదేత ద్యశస్యం
వాచో వికారాః కవయో వదంతి
అస్మిన్ యోగే సర్వమిదం ప్రతిష్ఠిత
మేత ద్విదు రమృతాస్తే భవంతి

మహత్తరమైనటువంటి ప్రశస్తిని కలిగించేటటువంటి యోగశాస్త్రాన్ని యోగియైన విద్వాంసుడు శిష్యులకు బోధించాలి. ఇతర శాస్త్రాలన్నీ వాక్కుల వికారాలే కాని ప్రయోజనం కలిగించేవికావు. సమస్తము యోగంలోనే ఉంది. దీనిని తెలిసికొన్నవారు అమృతులౌతున్నారు.

19. నకర్మణా సుకృతేనైవ రాజన్!
సత్యం జయే జ్జుహుయద్వా యజేద్వా
నైతేన బాలోఽమృత్యు మభ్యేతి రాజన్!
రతిం చాసౌ నలభత్యంతకాలే

ఓ రాజేంద్రా! హోమం చేసినా, యాగం చేసినా, సత్కర్మలు చేసినా మోక్షాన్ని మానవుడు అందుకోలేడు. అవివేకియైనవాడు ఈ కర్మలవల్ల మోక్షాన్ని పొందవలెనని భావిస్తాడుకాని పొందలేడు. చివరకు అంత్యకాలంలో ఆనందాన్ని పొందలేడు.

20. తూష్ణీమేక ఉపాసీత చేష్టేత మనసాపిచ
తదా సంస్తుతి నిందాభ్యాం ప్రీతిరోషౌ వివర్జయేత్

విద్వాంసుడైనవాడు తాను ఉపాసనచేసే సమయంలో ఒంటరిగా నిశ్చలంగా ఉండాలి మనస్సును ఏటువైపు పోనీయకుండా మనో వ్యాపారాలను ఆరికట్టాలి. ఎవరైనా స్తుతిస్తే సంతోషాన్నిగాని, దూషిస్తే దుఃఖాన్నిగాని పొందకుండగా సమ చిత్తంతో ఉండాలి.

21. అత్రైవ తిష్ఠన్ క్షత్రియ బ్రహ్మావిశతి పశ్యతి
వేదేషు చానుపూర్వ్యేణ హ్యేతద్విద్వన్! బ్రవీమి తే

విద్వాంసుడవైన ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఈవిధంగా నిశ్చలమైన మనస్సుతో ధ్యానంచేసినవాడు పరబ్రహ్మమును దర్శిస్తున్నాడు, చేరుతున్నాడు. వేదాలలోకూడ ఈ విషయమే వివరింపబడింది. అదే నేను నీకు ఉపదేశిస్తున్నాను.

# "భగవంతుణ్ణి సందర్శించు"

సనత్సుజాత ఉవాచ—

1. యత్తచ్ఛుక్రం మహజ్జ్యోతి ర్దీప్యమానం మహద్యశః
యద్వై దేవా ఉపాసతే యస్మాదర్కో విరాజతే
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

శ్రీ సనత్సుజాత మహర్షి ధృతరాష్ట్రునికి ఆనంద పరబ్రహ్మ తత్వాన్ని ఇలా బోధించసాగాడు— ఓ రాజేంద్రా! ఆ పరమేశ్వరుడు తచ్ఛబ్ద వాచ్యుడు, ఆయన జ్యోతి స్వరూపుడు, ఆయన యశో విరాజితుడు. ఆనంద పరబ్రహ్మ స్వరూపమైన ఆ దేవ దేవుణ్ణి దేవతలంతా ఉపాసిస్తున్నారు. ఆ పరాత్పరుని వల్లనే సూర్యుడు దేదీప్యమానంగా తేజరిల్లుతున్నాడు. అటువంటి సనాతనుడైన భగవంతుణ్ణి యోగీశ్వరులు జ్ఞానయోగంచేత దర్శిస్తున్నారు.

"తస్యభాసా సర్వమిదం విభాతి తస్యనామ మహద్యశః"
"యేన సూర్య స్తపతి తేజసేద్ధః"

దాని కాంతి నుండి ఇది అంతయు ప్రకాశిస్తున్నది. అదీ శుద్ధ పరబ్రహ్మ స్వరూపం. దాని పేరు మహాయశస్సు. దానిచేతనే సూర్యుడు దినకరుడై ప్రకాశిస్తున్నాడు ఆ తేజస్సు సర్వత్ర వ్యాప్తమై యున్నదని శ్రుతి వచనం.

2. శుక్లా ద్బ్రహ్మ ప్రభవతి బ్రహ్మ శుక్లేణ వర్ధతే
తచ్ఛుక్లం జ్యోతిషాం మధ్యే త ప్తం తపతి తాపనమ్
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

ఓ రాజా! శుద్ధ సచ్చిదానంద స్వరూపుడైన ఆ పరాత్పరుని సంకల్పం వల్లనే హిరణ్యగర్భుడనే బ్రహ్మ ఉద్భవిస్తున్నాడు హిరణ్యగర్భుడు ఆ పరాత్పరుని వల్లనే వృద్ధిపొందుతున్నాడు. ఆ పరమాత్మ ఇతర జ్యోతిస్సుల వల్ల తాను ప్రకాశింపబడేవాడు కాడు. అన్నింటినీ తానే ప్రకాశింపజేస్తున్నాడు. ఆయన స్వయం ప్రకాశుడు. ఆ సనాతనుడైన భగవంతుణ్ణి యోగీశ్వరులు దర్శిస్తున్నారు.

3. పూర్ణా త్పూర్ణ ముద్ధరంతి పూర్ణా త్పూర్ణం ప్రచక్షతే
హరంతి పూర్ణా త్పూర్ణంచ పూర్ణ మేవావశిష్యతే
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

పరిపూర్ణుడైన ఆ పరమాత్మునివల్ల పరిపూర్ణమైన జగత్తు ఉద్భవిస్తోంది. జగత్తు అంటే చరాచర ప్రాణికోటి సమన్వితం. పరిపూర్ణుడైన ఆ భగవంతుని నుంచి పుట్టిన జీవులు కూడ పూర్ణులుగానే భావింపబడుతున్నారు. అంటే భగవత్స్వరూపులుగానే భావింపబడుతున్నారు. మరల పూర్ణుడైన జీవుని నుంచి పూర్ణుడైన పరమాత్మ ఉపసంహరింపబడుతున్నాడు. చివరకు పూర్ణమైన పరమాత్మ స్వరూపమే మిగులుతోంది. అటువంటి పూర్ణ స్వరూపుడైన పరమాత్ముణ్ణి యోగీశ్వరులు దర్శిస్తున్నారు.

"పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే"

ఇది శ్రుతి వచనం. ఇది పూర్ణం. అది పూర్ణం. పూర్ణ భావంనుండి పూర్ణ భావమే జనిస్తుంది. పూర్ణం నుండి పూర్ణం తీసివేస్తే మరల పూర్ణమే మిగిలి ఉంటుంది. అంతా పూర్ణమే ఇది బ్రహ్మతత్వం.

4. ఆపోఽథాద్భ్య స్సలిలం తస్య మధ్యే
హ్యుభౌ దేవౌ శిశ్రియాతేఽంతరిక్షే
అధ్రద్రీచీ స్సవిషూచీ ర్వసానా ఉభౌ
బిభ ర్తి పృథివీం దివం చ
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

రస స్వరూపుడై న ఆ పరమాత్మ నుంచే పంచభూతాలు ఉద్భవించినాయి. పంచభూతాలతో పాంచభౌతిక శరీరం సృజింపబడింది ఆ శరీరమధ్యంలో హృదయాకాశంలో దేవుడు, జీవుడు ఇద్దరు నివసిస్తున్నారు. అందులో జీవుడు తన యదార్థ స్వరూపాన్ని మరచిపోయి మాయా సమన్వితుడై ఉంటాడు. దేవుడు మాయా రహితుడై , హృదయాకాశంలోనే కాక అంతటా వ్యాపించి, జగత్కారణ భూతుడై తేజరిల్లుతున్నాడు. అటువంటి పరమాత్మను యోగీశ్వరులు దర్శిస్తున్నారు.

5. చక్రే రథస్య తిష్ఠంతం ధ్రువస్యా వ్యయకర్మణః
కేతుమంతం వహంత్యశ్వా స్తం దివ్య మజరం దివి
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

రథ చక్రమంటే శరీరం. నశించే స్వభావంతో ఉండికూడ శాశ్వతుడైన భగవంతునివైపు ప్రయాణించేది ఈ శరీరం. ఈ రథానికి అశ్వాలు ఇంద్రియాలే. ఆ ఇంద్రియాలనే గుఱ్ఱాలు ఈ శరీర రథాన్ని విషయాలవైపు లాగుతుంటాయి. కాని జీవుడు జ్ఞానవంతుడైతే ఆ యశ్వాలు హృదయాకాశ మధ్యవర్తియైన పరమాత్మ సన్నిధికి చేరుస్తాయి. అటువంటి జ్ఞాన గమ్యుడైన పరమాత్ముణ్ణి యోగీశ్వరులు దర్శిస్తున్నారు.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు
బుద్ధింతు సారధిం విద్ధి మనః ప్రగ్రహమేవచ"
—కఠోపనిషత్తు

ఆత్మ రథికుడు. శరీరం రథం. బుద్ధి సారధి. మనస్సు పగ్గం. ఇంద్రియాలు గుఱ్ఱాలు. విషయవాసనలు మార్గాలు. ఆత్మ ఇంద్రియాలు మనస్సు కలిసిన తత్త్వం జీవుడిది. ఈ జీవుడు భోక్త—అని ఉపనిషత్తు వచించింది.

6. న సందృశే తిష్ఠతి రూపమస్య
న చక్షుషా పశ్యతి కశ్చిదేనమ్
మనీషయా మనసా వై హృదా చ
య ఏవం విదు రమృతాస్తే భవంతి
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

ఓ రాజేంద్రా! ఆ పరమాత్ముణ్ణి ఎవరితోనూ పోల్చటానికి వీలులేదు. ఈ చర్మ చక్షువుల ఆ దేవదేవుణ్ణి దర్శించజాలవు. నిశ్చయాత్మక బుద్ధితో, మనస్సుతో, హృదయంతో ఆ స్వామిని ఎవరు తెలిసికొంటారో వారే ఉత్తమ భక్తులు, ముక్తులు. వారు పరమాత్మ సాయుజ్యం పొందుతారు. హృదయంచేత అంటే హృదయంలో ఉండే భగవంతుని అనుగ్రహంవల్ల అనికూడ అర్థం. అటువంటి సనాతనుడైన భగవంతుణ్ణి యోగీశ్వరులు దర్శిస్తున్నారు.

7. ద్వాదశ పూగా స్సరితో దేవరక్షితాః
మధ్వీశతే తదా సంసరంతి ఘోరమ్

ఓ రాజా! ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి ఈ పన్నెండు నదులవలె మానవునిలో కలిసి ఉంటాయి. వీటిని సంరక్షించేది ఆ పరమాత్మడే. ఈ యింద్రియాలు వాటి వాటి సంబంధమైన విషయాలననుభవిస్తూ ఉంటే అటువంటివాడు ఘోరమైన ఈ సంసార నదీ ప్రవాహ జలంలో మునిగి తేలుతూ ఉంటాడు. కాబట్టి ఇంద్రియాలను విషయాలవైపు మరలనీయకుండగా ఉండాలి. అందుకు భగవంతుఒక్కడే శరణ్యం. అటువంటి సనాతనుడైన పరాత్పరుణ్ణి యోగీశ్వరులు దర్శిస్తున్నారు

8. తదర్ధమాసం పిబతి సంచితం భ్రమరో మధు
ఈశానస్సర్వ భూతేషు హవిర్భూత మకల్పయత్
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

ఓ రాజా! భ్రమరం నెలలో సగం రోజుల వరకు తేనెను కూడబెడుతుంది. మిగిలిన సగం మాసం ఆరగిస్తూ కాలం గడుపుతుంది. అలాగే భ్రమణశీలుడైన ఈ

జీవన సంసారి తాను క్రితం జన్మలో చేసిన సంచిత కర్మ ఫలాన్ని ఈ జన్మలో అను భవిస్తూ ఉంటాడు. పరమాత్మ సమస్త ప్రాణులను వారి వారి కర్మానుసారం కర్మఫల భోగాలు అనుభవింపజేస్తాడు. అటువంటి భగవంతుణ్ణి యోగీశ్వరులు దర్శిస్తున్నారు.

9. హిరణ్యపర్ణ మశ్వత్థ మభివత్య అపక్షకాః
తే తత్ర పక్షిణో భూత్వా ప్రపతంతి యథా సుఖమ్
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

ఓ రాజా! జీవికి ఈ విషయ వాసనా రూపచిత్రాలు స్వర్ణపత్రాలవలె మనో హరంగా దర్శనమిస్తాయి. సంసార రూపమైన అశ్వత్థ వృక్షంమీద పయనించి రెక్కలులేని జీవుడు కర్మఫలాలు అనే రెక్కలు ధరించి తన కర్మ వాసనానుసారం విభిన్న జన్మలు ఎత్తుతాడు. ఒక జన్మ నుంచి మరొక జన్మకు ప్రయాణిస్తుంటాడు. ఈ సంసార వృక్ష సృష్టికర్తయైన పరమాత్మణ్ణి యోగీశ్వరులు మాత్రమే దర్శిస్తున్నారు.

10. అపానం గిరతి ప్రాణః ప్రాణం గిరతి చంద్రమాః
ఆదిత్యో గిరతే చంద్ర మాదిత్యం గిరతే పరః
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

ఓ రాజా! చంద్రుడంటే మనస్సు. ఆదిత్యుడంటే బుద్ధి, పరుడంటే పరమాత్మ. యోగసమాధి సమయంలో అపానాన్ని ప్రాణంలోను, ప్రాణాన్ని మనస్సులోను, మనస్సును బుద్ధిలోను, బుద్ధిని పరమాత్మలోను లయం చేసి ఆనంద స్వరూపుడైన ఆ భగవంతుని కనుగొనాలి. ఆ సనాతనుడైన పరమాత్మణ్ణి యోగీశ్వరులు దర్శిస్తు న్నారు.

11. ఏకం పాదం నోత్క్షిపతి సలిలాద్ధంస ఉచ్చరన్
తం చేత్సతత మృత్క్షిపే న్న మృత్యుర్నామృతం భవేత్
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

హంస అంటే అవిద్యను పోగొట్టేవాడు పరమాత్మ. ఆ పరమాత్మ సంసార మనే కాసారంలో జీవుడనే పాదంమీద సంచరిస్తూ ఉంటున్నాడు. ఈ సంసారంలో

ఉన్నప్పటికీ ఆ పరమాత్మకు సంసారం అంటనే అంటదు. ఆ పరమాత్మ జీవుడనే ఈ పాదాన్ని ఉపసంహారం చేయటంలేదు. ఆ పరమాత్మ జీవుడిలోపలనే తన మాయ చేత ప్రవేశించి ఉంటున్నాడు. ఈ పాదం తొలగిస్తే అన్ని బంధాలు నశిస్తాయి ఆప్పుడు సంసారమే ఉండదు. సంసారమే ఉండనప్పుడు మృత్యువులేదు, మోక్షము లేదు. కనుకనే స్వామిజగద్రక్షకుడై ఉన్నాడు. ఆ పరమహంసయైన పరమాత్మణ్ణి యోగీశ్వరులు స్పష్టంగా దర్శిస్తున్నారు.

12. అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా
లింగస్యయోగేన స యాతి నిత్యమ్
తమీశ మీడ్య మనుకల్పమాద్యం
ప్రశంతి మూఢా నవిరాజమానమ్
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

సకల భూతాలలోను ఆ పరమాత్మ సూక్ష్మ శరీర సంబంధంవల్ల అంగుష్ఠ మాత్రుడై భాసిస్తూ ఉంటాడు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ ఆనందమయములనే పంచకోశాలకు లోపల అంగుష్ఠ మాత్రమైన హృత్పుండరీకం పరమాత్మ నివాసం. ఆ పరమాత్మ ఉపాధి సంబంధంచేత సంసారాన్ని పొందుతున్నాడు. ఈశ్వరుడు, ప్రశంసనీయుడు అయిన ఆ పరమాత్మణ్ణి అజ్ఞానులు చూడలేరు. సనాతనమైన ఆ స్వామిని యోగీశ్వరులు ఆనందంతో దర్శిస్తున్నారు.

13. గూహంతి సర్పాఇవ గహ్వరేషు
తేయం నీత్వా స్వేన వృత్తేన మర్త్యాన్
తే విప్రముహ్యంతి జనా విమూఢాః
తైర్దత్తాపై మోహయంతే భయాయ
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

ఓ రాజా! సర్పాలు తమకు కనిపించినవారిని హతమార్చి గుహలలో దాగి యుండే విధంగా ఇంద్రియాలు తమకు లోబడినట్టి విషయాలలో ప్రవర్తించి మానవుల్ని నాశనంచేసి మానవ శరీరాలలోనే దాగియుంటున్నాయి. విషయాసక్తులైన

అజ్ఞానులు ఈవిధంగానే మోహాన్ని పొందుతున్నారు. ఇంద్రియాలవల్ల కలిగే ఈ విషయ వ్యామోహం మిక్కిలి భయాన్ని కలిగిస్తున్నది. ఇంద్రియ విషయ మోహాతీతుడైన పరమాత్మణ్ణి యోగీశ్వరులు విశేషంగా దర్శిస్తున్నారు.

14. అసాధనా వాపి ససాధనావా
సమాన మేతద్దృశ్యతే మానుషేషు
సమానమేత దమృతస్యేతరస్య
హ్యేవం యుక్తో మధు తద్వై పరీప్సేత్
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

ఈ ఆత్మ స్వరూపం శమదమాది సాధన సంపత్తి లేనివారిలోను, ఆ సాధన సంపత్తి ఉన్నవారిలోను ఒకేవిధంగా శోభిస్తూ ఉంటుంది. మోక్షం కోరేవారిలోను, సంసారం కోరేవారిలోను ఇది సమానమే. అయినా విద్వాంసుడైనవాడు శమదమాది సాధన సంపత్తి కలిగి బ్రహ్మానందాన్ని ప్రసాదించే మధురమైన మోక్షాన్ని పొందగలుగుతాడు. అటువంటి నిర్వికార స్వరూపుడైన పరాత్పరుణ్ణి యోగీశ్వరులు దర్శిస్తున్నారు.

15. ఉభౌ లోకౌ విద్యయా వ్యాప్యయాంతి
తదా హుతం చాహుతమగ్నిహోత్రం
మాతే బ్రాహ్మీ లఘుతా మాదధీత
ప్రజ్ఞానం స్యాన్నామ ధీరా లభంతే
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

బ్రహ్మజ్ఞానం గలిగినవాడు ఆ బ్రహ్మ విద్య చేతనే ఇహ పరలోకాల్ని రెంటిని పొందగలుగుతున్నాడు. అటువంటి బ్రాహ్మమూర్తి ఆ బ్రహ్మవిద్య చేతనే అగ్నిహోత్రం చేయకపోయినా దానిని చేయటంవల్ల కలిగే ఫలితాన్ని పొందుతున్నాడు. ఆ జ్ఞాని మరల పతిత్వాన్ని పొందడు. అటువంటి బ్రహ్మవిద్యనే ప్రజ్ఞానం అన్నారు. ధీమంతులైనవారు ఆ ప్రజ్ఞానాన్ని పొందుతున్నారు. అటువంటివారే సనాతనుడైన భగవంతుణ్ణి దర్శిస్తున్నారు.

16. ఏవం దేవో మహాత్మా పావకం పురుషో గిరన్
యో వై తం పురుషో వేద తస్యేహాత్మా నరిష్యతే
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

ప్రజ్ఞానైక బ్రహ్మ స్వరూపంగల ఆ పరమాత్ముడు వాఙ్మానసాతీతుడు, జగత్సంహార కారకుడు. ఎవడు తన ఆత్మను పరమాత్మైక్యానుసంధానంచేసి ఆ పరమాత్మను సాక్షాత్తు తానుగా భావిస్తాడో ఇహలోకంలో కూడ అటువంటివాని ఆత్మయే నశించదనివె. ఏ పరమాత్ముణ్ణి తెలిసికొన్న తరువాత ఆత్మకు నాశనంలేదో అటువంటి పరమాత్ముణ్ణి యోగీశ్వరులు దర్శిస్తున్నారు.

17. తస్మాత్సదా సత్కృతం స్యాన్న మృత్యు రమృతం కుతః
సత్యానృతే సత్యసమానబంధనే సతశ్చ యోని రసతశ్చైక ఏవ
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

పరమాత్మ సాక్షాత్తు తానేనని తెలిసికొనటంవల్ల, అటువంటి బ్రహ్మజ్ఞానంవల్ల మోక్షం కలుగుతుంది. దానివల్ల జనన మరణ రూపమైన సంసారంకాని, మరణానంతరం అనుభవించదగిన స్వర్గాది సుఖాలు కాని కలుగవు. అటువంటివాడు నిరంతరం బ్రహ్మాత్మ భావనతోనే సచ్చిదానంద సాగరంలో ఓలలాడుతూ ఉంటాడు. అటువంటి యోగీశ్వరులు భగవంతుణ్ణి స్పష్టంగా సందర్శిస్తున్నారు.

18. అదర్శనే తిష్ఠతి రూపమస్య
పశ్యంతి చైనం సుసమిద్ధ సత్త్వాః
హీనో మనీషీ మనసాభిపశ్యే
ద్య ఏనం విదురమృతా స్తే భవంతి
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

ఓ రాజా! ఈ పరమాత్మ స్వరూపం అందరికీ ప్రత్యక్షంకాదు. పరమ పవిత్రమైన విశుద్ధమైన అంతఃకరణం గలవారికి మాత్రమే ఆ స్వామి సాక్షాత్కరిస్తాడు. ఆ మహాత్ముల అంతఃకరణాలు పవిత్రమైనవి. వారు తమ పవిత్ర హృదయాలతో స్వామిని సదా సందర్శిస్తారు. వారు అమరులు, ముక్తులు, అమృతులు, అటువంటి యోగీశ్వరులే సనాతనుడైన ఆ పరాత్పరుణ్ణి దర్శిస్తున్నారు.

19. ఇమం య స్సర్వభూతేషు చాత్మాన మనుపశ్యతి
అన్యత్రాన్యత్ర యుక్తేషు కిం న శోచే త్తతఃపరమ్

పరమాత్మ సర్వాంతర్యామి యని, తానే ఆ పరమాత్మ యని, సకల జీవ రాశిలోను ప్రకాశించేది ఆత్మ స్వరూపమేనని తెలిసికొని, ఆవిధంగా దర్శించగలిగే జ్ఞానులు, దేహేంద్రియాదుల పట్ల అభిమానం గలవారి గురించి ఏవిధమైన పరితాపాన్ని పొందరు. అటువంటి జ్ఞానులు భగవంతుణ్ణి దర్శిస్తున్నారు.

20. యథోదపానే మహతి సర్వత స్సంప్లుతోదకే
ఏవం భూతేషు సర్వేషు బ్రాహ్మణస్య విశేషతః
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్

ఓ రాజా! అన్నివైపుల జలం పరిపూర్ణంగా నిండియున్నప్పుడు జలాశయంతో ఏవిధంగా ప్రయోజనంలేదో, అదేవిధంగా పరమాత్మ దర్శనం పొందినవానికి ఇతర భూతాలనుండి పొందదగిన ప్రయోజనం ఏమిఉంటుంది? అటువంటి బ్రహ్మ జ్ఞానం పొందిన యోగీశ్వరులు సనాతనుడైన పరాత్పరుణ్ణి సందర్శిస్తున్నారు.

21. అహమేవాస్మి వో మాతా పితా పుత్రోఽస్మ్యహం పునః
ఆత్మాహ మస్య సర్వస్య యచ్చ నాస్తి యదస్తిచ

సనత్సుజాత మహర్షి తాను ఆత్మస్వరూపంగా భావించుకొంటూ ఇంకా ఇలా పలికాడు—— ఓ ధృతరాష్ట్ర మహారాజా! నేను ఒక జన్మలో తల్లిగాను, మరొక జన్మలో తండ్రిగాను, వేరొక జన్మలో కుమారుడుగాను జన్మిస్తున్నాను. అయినప్పటికి ఆ శరీరాలకన్నింటికి నేనే ఆత్మగా శోభిస్తున్నాను. గతించిన శరీరాలకు వలెనే రాబోయే శరీరాలకు కూడ నేను ఆత్మగా ప్రకాశిస్తున్నాను.

22. పితామహోఽస్మి స్థవిరః పితా పుత్రశ్చ భారత!
మమైవ యూయ మాత్మస్థా నమే యూయం నచాప్యహమ్

నేనే జన్మపరంపరల భేదాలలో ఒకసారి వృద్ధుడైన తాతగాను, మరొకసారి బాలుడైన కుమారుడుగాను, వేరొకసారి నడివయస్సుగల తండ్రిగాను ఉండవచ్చు-

ఆత్మ సంబంధంతో పరిశీలిస్తే అందరు పరమాత్మ సంబంధులే కాబట్టి అందరికి పరస్పర సంబంధం ఉంది. శరీర సంబంధంతో పరిశీలిస్తే శరీరానికి ఆత్మకు సంబంధంలేదు కాబట్టి ఒక ఆత్మకు మరొక ఆత్మకు సంబంధం లేదనిపిస్తుంది.

23. ఆత్మైవ స్థానం మమ జన్మచాత్మా
ఓతః ప్రోతోఽహ మజహరప్రతిష్ఠః
అజశ్చరో దివారాత్ర మతంద్రితోఽహం
మాం విజ్ఞాయ కవి రాస్తే ప్రసన్నః

నాకు అధిష్ఠానం పరమాత్మయే. నేను ఉండేది పరమాత్మలోనే. నాకు పుట్టుక లేదు. నూలు పడుగులోను, పేకలోను ఉన్నట్లుగా పరమాత్మలో నేను ఉన్నాను. రాత్రింబగళ్ళు విషయాంతరాలపైకి పశునించకుండగా నేను నిత్య జాగరూకుడనై సంచరిస్తుంటాను. విద్వాంసుడు నా తత్వం తెలిసికొని పరమానందాన్ని పొందు తున్నాడు.

24. అణో రణీయాన్ సుమనా స్సర్వభూతేషు జాగ్రతి
పితరం సర్వ భూతేషు పుష్కరే నిహితం విదుః

ఓ రాజా! ఆ పరమాత్మ అణువుకంటె సూక్ష్మమైన వాడుగా ఉంటూ సకల జీవరాశిలోను అంతర్యామిగా ప్రకాశిసున్నాడు. సమస్త సృష్టికర్త ఆ పరమాత్ముడే అందరకు తండ్రియైన ఆ భగవంతుడు అందరి హృదయ పద్మాలలోను విరాజిల్లు తున్నాడని తెలిసికొని బ్రహ్మజ్ఞానులు ఆ పరాత్పరుణ్ణి దర్శించి కృతకృత్యులు కాగలుగు తున్నారు బ్రాహ్మీమూర్తులు ఆవిధంగా పునరావృత్తిరహితమైన మోక్షాన్ని పొందు తున్నారు. అటువంటివారు ధన్యులు! అని సనత్సుజాత మహర్షి ధృతరాష్ట్ర మహారాజు నకు పరమాత్మ తత్వాన్ని ఉపదేశించాడు.

అసతోమా సద్గమయః
తమసోమా జ్యోతిర్గమయః
మృత్యోర్మా అమృతంగమయః
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః